# చందమామ

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.

Chandamama - H I N D I
Chandamama - T E L U G U
Chandamama - K A N N A D A
Chandamama - G U J A R A T I
Chandoba - M A R A T H I
Ambulimama - T A M I L

GRAMS: "CHANDAMAMA"



PHONE: 444851 - 6 LINES

ESTD. 1947

# CHANDAMAMA PUBLICATIONS

2 & 3, ARCOT ROAD :: VADAPALANI :: MADRAS - 26

''చందమామ ఆంగ్లభాషలో ఎందుకు వెలువడడం లేదు?'' అని పాఠకుల దగ్గర్నుంచి గత కొన్ని సంవత్సరాలుగా నాకు అసంఖ్యాకంగా లేఖలు వస్తున్నాయి. వాటిని పురస్కరించుకుని, ఆంగ్లంలో కూడా 'చందమామ'ను వెలువరించడానికి నిశ్చయించుకున్నాను. జూలై మాసం నుంచి ఆంగ్ల 'చందమామ' లభించబోతున్నది! ఇదివరలో మీరు చదవని ఎన్నో కథలు ఇందులో వుంటాయి. భారతీయ ఇతిహాసానికి సంబంధించిన అద్భుత గాథలు; వాటితోపాటు రష్యా, సిసిలీ దేశాలకు చెందిన చెరొక కథా ఉంటాయి. 75 పైసలకు కచ్చితమైన విలువ కనిపిస్తుంది; అందువల్ల ఒక కాపీ కొనుక్కుని మీరే చూడవచ్చుగా!

సంపాదకుడు







ఎక్కడ

# లైఫ్‌బాయ్

వున్నదో అక్కడ

## ఆరోగ్యం

వున్నది

**లైఫ్‌బాయ్**

మురికిలో గల సూక్ష్మ

క్రిములను కడిగివేస్తుంది

లింటాస్-L. 62-77 TL

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

త్వరలో వస్తున్నారు!



రామ విజేతా ఫిలిమ్స్ సమర్పించు:

# తల్లిదండ్రులు

స్క్రీన్‌ప్లే & దర్శకత్వం:

కె. బాబూరావు

నిర్మాత:

కె. ఎ. ప్రభాకర్

సంగీతం: ఘంటసాల







# విసవేవచ్చినదని భయము ఎంత మాత్రము అవసరము లేదు.

క్రమముగా ప్రతిదినము అశోకా శాండల్‌వుడ్ - ఫేస్ - టాల్కు మరియు అల్పర్పస్ పౌడర్సు ఉపయోగించిన వేసవి తాపమును తెలియనివ్వదు. వేసవివల్ల కలిగిన చెమట గుల్లలు, చర్మం ఎరుపు, మంటలు వగైరాలను పోగొట్టి శరీరమునకు చల్లదనమును - హాయిని కలిగించును. మరియు, వీటి మనోహర చందన పరిమళము మిమ్ములను దిన మంతయు ఉత్సాహ భరితులను చేయును. నేడే ఉపయోగమును ప్రారంభింపుడు.




విజయా కెమికలు, మద్రాసు-7.

---

పొదుపుకీ, అందానికీ

ఎల్లప్పుడూ వాడవలసినవి

# AMARJOTHI FABRICS

## BEDSPREADS-FURNISHINGS-FANCY TOWELS



తయారు చేయువారు:
అమర్‌జ్యోతి ఫాబ్రిక్స్,
పోస్టుబాక్సు నం. 22, కరూర్ (ద.భా.)
బ్రాంచీలు: బొంబాయి-ఢిల్లీ

మద్రాసు ఏజెంట్లు:
అమర్‌జ్యోతి ట్రేడర్స్,
99, గొడౌన్ స్ట్రీట్, మదరాసు-1
ఫోన్: 28438



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

మానవ యత్నంవల్ల సాధ్యం కాని దానికి దేవుణ్ణి నమ్ముకోవటంలో అర్థం ఉంటుందిగాని, తన భారమంతా దేవుడి పైనే వేసి, చేతులు కట్టుకు కూర్చున్న వాడు మూఢుడు. ఈ నీతి "దేవుడి పై భారం" అన్న కథలో మనకు స్పష్టంగా కనిపిస్తుంది.

మరొకరకం మనుషులు తాము ఆశించిన దానికి మించిన సుఖాలు సంప్రాప్తమైనా వాటిని పోగొట్టుకునే చిలిపిపనులు ఏవో చేస్తారు. అవే వారికి "శోక కారణం" అవుతాయి.

సంపుటి 46  జూన్ '70  సంచిక 6

CHITRA





# దేవుడిపైభారం

పూర్వం పర్షియాదేశం లోని ఒక గ్రామంలో ఫకీరు ఒక డుండేవాడు. వాడు వట్టి మూర్ఖుడూ, సోమరిపోతూనూ. కాళ్ళూ, చేతులూ ఉండి, కావలసినంత బలం వున్నా కష్టం చేసి బతకాలన్న ఇచ్ఛలేదు వాడికి. అసలు కష్టానికి అతని ఒళ్ళు వంగేది కాదు. కడుపు నింపడం కోసం యాచన చేసేవాడు. మిగిలిన కాలమంతా నిద్రపోతూనే, అటూ ఇటూ తిరుగుతూనే వెళ్ళబుచ్చేవాడు. "ఎద్దులా వున్నావు, కష్టం చేసి బ్రతక లేవా?" అని ఎవరెన్ని తిట్టినా పట్టించుకునే వాడుకాడు.

అయితే, రాను రాను అతనికి ఊళ్ళో భిక్షం పెట్టేవాళ్ళే కరువయారు. ఒక్క పూట తిండికి గడవడం కూడా గగనమై పోయింది. ఇక ఆ వూళ్ళో వుండడం సాధ్య పడదనిపించి, మరొక వూరికి వలసపోతే అక్కడ కొంతకాలం గడపవచ్చు ననుకొని, ఒకనాటి ఉదయం ప్రక్క వూరికి బయలు దేరాడు ఫకీరు.

మధ్యలో ఒక పెద్ద అడవి దాటవలసి వచ్చింది. ఫకీరు అడవి గుండా ప్రయాణం చేస్తూండగా ఒకచోట కాళ్ళూ, చేతులూ లేని నక్క ఒకటి కనిపించింది. ఆశ్చర్య పోయాడు ఫకీరు :

"అహా, భగవంతుని సృష్టి! కాళ్ళూ, చేతులూ లేకుండా ఈ నక్క, ఈ భయం కరాటవిలో ఎలా జీవిస్తున్నట్టు? ఆహారం ఎలా సంపాదించుకుంటున్నది?"

ఫకీరు ఇలా అనుకుంటూండగా, పెద్ద పులి ఒకటి జింకను చంపి అటుగా ఈడ్చు కొని వచ్చింది.

పులిని చూడగానే ఫకీరు ఒక పొద చాటున.నక్కి కూర్చున్నాడు.

పెద్దపులి తన ఆకలి తీరేవరకు జింకను కొంతవరకు తిని, మిగిలిన దాన్ని అక్కడే

ఎస్. ఎ. వహబ్

వదిలేసి వెళ్ళిపోయింది. పులి తినగా మిగిలిన జింక దేహాన్ని, కాళ్ళూ, చేతులూ లేని ఆ మొండి నక్క తిని, ఆకలితీర్చుకున్నది.

ఫకీరుకు ఒక గొప్ప సత్యం తెలిసి వచ్చినట్టు అనిపించింది. సకల జీవపోషకుడైన సర్వేశ్వరుడే ఆ మొండి నక్కకు అవసరమైన ఆహారాన్ని సకాలంలో దానికి అందజేస్తున్నాడు!

భగవంతుడికి గల ధర్మబుద్ధిపై ఫకీరుకు అపారమైన విశ్వాసం పుట్టుకొచ్చింది.

"భగవంతుడు ఆ మొండి నక్కకు ప్రతిరోజూ దాని ఆహారం అందిస్తున్నట్టే, నాకు మాత్రం ఎందుకు అందించడు? నేను ప్రతి ఇంటికీపోయి యాచించవలసిన అవసరం ఏమిటి? ఏమైనాసరే ఇకమీదట నేను ఎవరినీ తిండి యాచించబోను. భగవంతుణ్ణే నమ్ముకుంటాను. నక్కలాగే నేనూ ఒక మూల కూర్చుంటాను. నా దిన బత్తెం భగవంతుడే నా దగ్గిరికి పంపిస్తాడు," అని నిశ్చయించుకుని ఆ ఫకీరు గ్రామం వైపు ప్రయాణం సాగించాడు.

అతను ప్రక్క గ్రామం చేరి తిన్నగా మసీదు వద్దకుపోయి, జోలెకట్టి మసీదు ముందు నిలబడ్డాడు.

అక్కడున్న ఒక పెద్ద మనిషి ఫకీరును చూసి, "అయ్యా, ఇక్కడ ఎవరూ లేరు.



మరొక చోటికి పోయి యాచించు," అని సలహా ఇచ్చాడు.

"ఇల్లంటూ ఉన్న తరవాత ఎవరూ ఉండక పోవటమేమిటి? ఇందులో ఉండే వారు దీనుల అవస్థకు జాలి చెందరా?" అన్నాడు ఫకీరు.

ఆ పెద్దమనిషి చిరాకుపడుతూ, "ఇక్కడ ఉండేది ఎవరనుకుంటున్నావు? నీకూ, నాకూ ప్రాణం ఇచ్చినవాడూ, సకలజీవ పోషకుడూ అయిన సర్వేశ్వరుడు. అతన్ని అపహాస్యం చెయ్యకు. దయవుంచి వెళ్ళిపో." అన్నాడు.

"సర్వేశ్వరుడి ఇంటి ముందు యాచించి వట్టి చేతులతో వెళ్ళిపోవటమేమిటి? ఏమైనా సరే నా భిక్షాన్ని తీసుకోకుండా ఇక్కడి నుంచి పోను!" అంటూ ఫకీరు ఒక చెట్టు నీడన జోలెదింపి, "దీనపోషకా, నీ అదృశ్య భండారం నుంచి నా దిన బత్తెం పంపించు!" అంటూ బైఠాయించాడు.

ఫకీరు ఆ ఫూరికి కొత్త కావటం చేత అతన్ని గురించి పట్టించుకున్నవాడే లేక పోయాడు.

కొంతకాలానికి, తిండిలేక ఫకీరు శుష్కిం చాడు. అతని కండలన్నీ కరిగిపోయి, చర్మమూ, ఎముకలూ మిగిలాయి. ఫకీరు అవసానదశను చేరుకుంటున్నాడు.

ఆ సమయంలో మసీదు అంతర్భాగం నుంచి ఈ మాటలు వినిపించాయి:

"మూర్ఖుడా, నీవు కాళ్ళూ, చేతులూ లేని మొండి నక్కవా? శక్తి కలిగి ఎంగిలి మెతుకులకు ఆశ పడటం నీచం. కాయ కష్టంతో పరుల సౌఖ్యానికి పాటుపడేవారిని నేను అనుగ్రహిస్తాను."

ఈ మాటలు విని ఫకీరు సిగ్గుపడ్డాడు. అతనికి జ్ఞానోదయమయింది. కొస ప్రాణంతో అతను మసీదు నుంచి బయటపడి, ఆ నాటి నుండి కాయకష్టం చేసి, నలుగురిలో పరువుగా బ్రతకసాగాడు.






క్షుత్ క్షామోపి, జరా కృశోపి, శిథిల ప్రాయోపి, కష్టాందశా
మాపన్నోపి, విపన్న దీధితిరపి, ప్రాణేషు నశ్యత్స్వపి,
మత్తేభేంద్ర విభిన్నకుంభ పిశితగ్రాసైక బద్ధస్పృహః,
కిం జీర్ణం తృణమత్తి మానమహతా మగ్రేసరః కేసరీ. 1

(అమితమానం గల సింహం ఆకలితో అలమటించినా, ముసలిదయినా, కష్టదశలో ఉన్నా, శక్తి ఉడిగినా, ప్రాణాలు పోయే స్థితిలో ఉన్నా కూడా ఏనుగు కుంభస్థలం చీల్చి తినాలని కోరుతుంది గాని, ఎండుగడ్డి తినగోరుతుందా?)

లాంగూలచాలన మధశ్చరణావఘాతం,
భూమౌ నిపత్య వదనోదర దర్శనం చ,
శ్వా పిండదస్య కురుతే గజపుంగ వస్తు
ధీరం విలోకయతి చాటు శతైశ్చ భుంక్తే. 2

(కుక్క తన కింత పిండం వేసేవాణ్ణి చూసి తోక ఆడించి, భూమి మీద వెల్లికిలా పడి నోరూ, పొట్టా చూపించుతుంది. కాని ఏనుగు మావటివాడి చేత ఎంతో తియ్యగా కబుర్లు చెప్పించుకుంటూ గంభీరంగా తింటుంది.)

పరివర్తిని సంసారే మృతః కో వా న జాయతే?
స జాతో యేన జాతేన యాని వంశస్స ముస్నతిమ్. 3

(జనన మరణ పరివర్తనలో చచ్చిన వారిలో పుట్టనివాడెవడు? ఎవడి వల్ల వంశం పైకి వస్తుందో వాడి పుట్టుకే పుట్టుక.)

మానధనులు



# శోక కారణం

ఒక గ్రామంలో రాజహంసుడనే ఒక యువకుడుండేవాడు. అతనికి తల్లిదండ్రులూ, అన్నదమ్ములూ ఎవరూ లేరు. తండ్రి సంపాదించిన దంతా విచ్చలవిడిగా ఖర్చు చేసి, బికారి అయిపోయాక పశ్చాత్తాపం చెంది, ఎక్కడికైనా పోయి, ఏదో విధంగా ధనం సంపాదించుకుని, ఒళ్ళు దగ్గిర పెట్టుకుని బతుకుదామని నిశ్చయించుకుని ఇల్లు విడిచి బయలుదేరాడు.

అతను చాలా దూరం ప్రయాణం చేసి అలసిపోయి, ఒక చెట్టు కింద విశ్రాంతి తీసుకుంటూ ఉండగా ఒక శ్రీమంతుడు అటుగా వచ్చాడు.

ఆయన మంచి బట్టలూ, మేలైన తలపాగా ధరించి ఉన్నాడు. ఆయన రాజహంసుణ్ణి పలకరించి, అతని పరిస్థితి తెలుసుకుని, "నువు నా వెంట మా ఇంటికి వచ్చెయ్యి. నాతోపాటు ఉండిపో. నిన్ను నా తమ్ముడిలాగా చూసుకుంటాను. నీకు ఏ లోటూ జరగదు. అయితే, మా ఇంటో అందరూ అస్తమానమూ ఏడుస్తూ ఉంటారు. దానికి కారణం ఏమిటో తెలుసుకోవటానికి ప్రయత్నించకు," అన్నాడు.

ఈ ఏర్పాటుకు రాజహంసుడు సంతోషంగా ఒప్పుకున్నాడు.

ఆ పెద్ద మనిషి ఇల్లు, రాజభవనం లాగున్నది. రాజహంసుణ్ణి ఎవరూ సేవకుడు లాగా చూడలేదు. అయితే అందరివీ ఏడుపు ముఖాలే. కారణం తెలుసుకోవాలని కుతూహలమైతే కలిగింది గాని, శ్రీమంతుడి మాట గుర్తుకొచ్చి రాజహంసుడు తన కుతూహలాన్ని అణచుకున్నాడు.

అస్తమానమూ ఏడుస్తూ ఉండే వారిలో అప్పుడప్పుడూ ఒక్కొకరు చచ్చిపోయేవారు. ఇంటి యజమాని వారికి ఉత్తర క్రియలు చేయించేవాడు.

ఏ. గోపీనాథ్

ఒకనాడు ఆయన రాజహంసుడితో, "నేను తీర్థయాత్రకు పోతున్నాను. తిరిగి వస్తానో, రానో. అందుచేత నువే ఈ ఇంటికి యజమానిగా ఉండు," అన్నాడు.

"ఈ ఇంటో అందరూ ఎందుకు ఏడుస్తున్నారో చెబుతారా ఇప్పుడన్నా?" అని రాజహంసుడు అడిగాడు.

"చెప్పను. వాళ్ళ దుఃఖానికి కారణం తెలుసుకున్నందువల్ల నీ కేమీ లాభం ఉండదు. మరో విషయం. ఈ భవనంలో తూర్పువాకిలి ఎన్నడూ తెరవకు. అది తెరిచి అవతలికి వెళ్ళావంటే పశ్చాత్తాపానికి గురి కాగలవు!" అన్నాడు యజమాని.

ఇలా హెచ్చరించి ఆయన తీర్థయాత్రలకు బయలుదేరి వెళ్ళిపోయాక ఒకనాడు రాజహంసుడికి ఆ తూర్పు ద్వారం తెరవాలని కుతూహలం కలిగింది. ఆ వాకిలి తెరిస్తే ఒక గదీ అందులో ఒక సొరంగ ద్వారమూ కనిపించాయి. అతను ఆ సొరంగంకుండా నడిచి వెళ్ళి సముద్ర తీరాన్ని చేరుకున్నాడు.

అక్కడ కూర్చుని ఉన్న ఒక బ్రహ్మాండమైన పక్షి లేచి వచ్చి, రాజహంసుణ్ణి తన కాళ్ళతో పట్టుకుని, సముద్రం మీదుగా ఎగిరి వెళ్ళి, ఒక నిర్జన ద్వీపంలో అతన్ని దించి, ఎటో ఎగిరిపోయింది.



రాజహంసుడు, ఏదన్నా ఓడ వచ్చి తనను రక్షిస్తుందేమోనని సముద్ర తీరాన నిలబడి చూస్తూ ఉండగా, కొంతసేపటికి అటుగా ఒక ఓడ రానే వచ్చింది. దాన్ని నడిపే వారంతా స్త్రీలే. వాళ్ళు అతన్ని తమ ఓడలో ఎక్కించుకుని ఏదో దేశానికి తీసుకుపోయారు.

ఓడ సరంగుగా ఉండిన స్త్రీ అతన్ని రాజ భవనానికి తీసుకుపోయి, "నేను ఈ దేశానికి రాణీని. నేను తగిన వరుణ్ణి వెతుకుతూ నీ కోసం వచ్చాను. నువు నన్ను పెళ్ళాడి, ఈ దేశానికి రాజువై, పాలించు," అన్నది.

"అంత కన్నానా?" అని రాజహంసుడు ఆమెను పెళ్ళాడి, సుఖంగా అక్కడే ఉండి పోయాడు.

ఒకనాడు అతను తన భార్యతో రాజ భవనం అంతా కలయ తిరుగుతూ ఒక మూసి ఉన్న ద్వారం వద్దకు వచ్చి, "ఈ గదిలో ఏ మున్నది?" అని అడిగాడు.

"అందులో ఏ మున్నదో ఎవరికీ తెలీదు. ఆ తలుపు తెరవరాదని పెద్దల ఆజ్ఞ." అన్నది రాణీ.

అయితే రాజహంసుడు రాణీకి తెలియకుండా ఒకనాడు ఆ తలుపు తెరిచాడు. లోపల సొరంగమే ఉన్నది. ఆ సొరంగం గుండా వెళ్ళగా సముద్రతీరం వచ్చింది. అతను సముద్రతీరంలో అడుగు పెట్టటూండగానే ఒక బ్రహ్మాండమైన పక్షి అతన్ని ఎత్తుకుని, ఎగిరిపోయి, మొదట ఉండిన భవనానికి చేర్చింది.

అతను తన రాణీని తలుచుకుని ఏడవ సాగాడు. ఆ భవనంలో ఉన్నవారంతా ఎందు కేడుస్తారో అతని కిప్పుడు అర్థమైంది.

తీర్థయాత్రలకు వెళ్ళిన యజమాని తిరిగి వచ్చి, రాజహంసుడిలో మార్పు గమనించి, "నువూ మిగిలిన వాళ్ళతో, చేరిపోయావా? నీ మంచి నీకే తెలియలేదు. ఏం చేస్తాం, అనుభవించు!" అన్నాడు.






# శిథిలాలయం

## 30

[వెఱ్ఱి వెలగపండు తిన్న నాంగ్‌సోమ్ మతిచెడి కేకలు పెట్టసాగాడు. పూజారి అతణ్ణి పట్టుకుని, శిథిలాలయం కనుక్కునేందుకు బయలుదేరాడు. కొండ మీద శిఖిముఖీ వాళ్ళు అతణ్ణి ఎదిరించారు. ఆ సందర్భంలో జాంగ్‌లా గాయపడ్డాడు. శిథిలాలయ పూజారి కింది లోయలో పడిపోయాడు. నాంగ్‌సోమ్ లోయలోకి దూకేశాడు. తరవాత—]

నాంగ్‌సోమ్ శిథిలాలయం అంటూ అరిచి లోయలోకి దూకటం చూస్తూనే శిఖిముఖీ, విక్రమకేసరీ నిర్విణ్ణులై పోయారు. గోల్ ఖరా నుంచి ఎంతో నేర్పుగా అతడు పడవను నడిపి, యీ వృశ్చికలంకకు చేర్చాడు. మార్గంలోనూ, ఇక్కడికి చేరింతరవాతా మొక్కపోని ధైర్యంతో తమకు సహాయపడ్డాడు. అటువంటి విశ్వాసపాత్రుడు మతిభ్రమతో లోయలోకి దూకి ప్రాణాలు కోల్పోవటం, వాళ్ళిద్దరికీ అంతులేని ఆవేదనను కలిగించింది

"శిఖీ! మనం గొప్ప మిత్రుణ్ణి పోగొట్టుకున్నాం. ఆ వెఱ్ఱివెలగపండులో ఏవో మహత్తర శక్తు లున్నవని నమ్మి, తిని, ఘోరమైన చావు తెచ్చుకున్నాడు," అన్నాడు విక్రమకేసరి.

శిఖిముఖి ఏదో జవాబు చెప్పబోయేంతలో జాంగ్‌లా పెద్దగా మూలుగుతూ,



"శిఖిదొరా! నాంగ్‌సోమ్ చచ్చిపోయి వుండడు. ఆ దూకటంలో ఏ మహావృక్షం మీద అయినా పడివుంటే, దాని కొమ్మలు అతణ్ణి కాపాడే అవకాశం వుంది. పైగా, అతడు శిథిలాలయం కనబడినట్టు కేక వేసి మరీ లోయలోకి దూకాడు. అందులో ఏమైనా వాస్తవం వుండవచ్చు," అన్నాడు.

ఆ మాటలు వినగానే శిఖిముఖి మనసులో కొంత ఆశ మొలకెత్తింది. అతడు జాంగ్‌లాను సమీపించి భుజం మీద చేయి వేసి ఆప్యాయంగా నిమిరి, "జాంగ్‌లా! నీ స్వామిభక్తే కాక, ధైర్యసాహసాలు కూడా నాకెంతో ఆనందం కలిగిస్తున్నవి.



నువ్వు పట్టుకోకపోతే ఆ శిథిలాలయ పూజారి మళ్ళీ చేజారి పోయివుండేవాడు." అని జాంగ్‌లా భుజం మీద తగిలిన గాయం నుంచి కారిన రక్తం గడ్డకట్టిపోవటం చూసి, "అరెరె! గాయానికి యింకా కట్టుకట్టలేదా?" అంటూ చుట్టూ కలయచూశాడు.

అదంతా గమనిస్తున్న వృశ్చికజాతి నాయకుడు చప్పున దాపుల నున్న పొదల్లోకి పోయి ఏదో ఆకుపసరు తెచ్చి, జాంగ్‌లా గాయానికి పూసి, కట్టు కట్టాడు. అప్పుడు విక్రమకేసరి, జాంగ్‌లాతో, "జాంగ్‌లా! నువ్వు చెప్పేదాన్నిబట్టి నాంగ్‌సోమ్ మాత్రమే కాక, దుష్టుడైన శిథిలాలయ పూజారి కూడా ఏ చెట్టుకొమ్మల మీదనో పడి బతికి వుండవచ్చుగదా?" అని అడిగాడు.

"అవును, దొరా! అలా జరిగితే ఆశ్చర్యపడవలసిందేమీ లేదు." అన్నాడు జాంగ్‌లా.

ఆ మాట వింటూనే వృశ్చికనాయకుడు కోపంగా ఒక గెంతు గెంతి, "బతికుంటే వాళ్ళిద్దర్నీ పౌర్ణమినాడు వృశ్చికమాతకు బలి ఇస్తాను. వాళ్ళల్లో ఒకడు మోసకారి, రెండవవాడు వృశ్చికజాతి నాయకుడు మాత్రమే తినే అర్హత గల వెర్రివెలగపండు తిని మాతకు అపచారం చేశాడు," అన్నాడు.








అతడి మాటలు విక్రమకేసరికి చాలా కోపం తెప్పించినై. అతడు చరురున కత్తి దూసి, "నువ్వు మొదటి నుంచీ యీ లంక కంతా మహారాజువైనట్టు మాటాడు తున్నావు. మనుషుల్ని బలిపెట్టటం అంత చులకన అనుకున్నావా? ఏదీ నీ శక్తి చూస్తాను, నీ ఆయుధం తీసుకుని యివతలికి రా!" అంటూ కొంచెం దూరంగా పోయి నిలబడ్డాడు.

వృశ్చికజాతివాళ్ళలో కలకలం బయలు దేరింది. వాళ్ళు వాళ్ళ నాయకుడి చుట్టూ చేరి గొడవగొడవగా మాట్లాడసాగారు. ఇలా నాలుగైదు నిమిషాలు గడిచింతరవాత వృశ్చికనాయకుడు, తన వాళ్ళను తొలగ దోసుకుని, రాతిగొడ్డలి పైకెత్తి విక్రమకేసరిని సమీపించాడు.

ఇప్పుడు బలి కన్న ఘోరమైన హత్య జరిగిపోనున్నదని శిఖిముఖి గ్రహించాడు. కేసరి ముందు వృశ్చిక నాయకుడు ఎందుకూ కొరగాడు. ఒక్క కత్తి విసురుతో అతడు వాణ్ణి ముక్కలుగా నరకగలడు!

శిఖిముఖి ఒక పెద్ద కేకతో వాళ్ళిద్దర్నీ వారించి జాంగ్‌లాను వెంటబెట్టుకుని వాళ్ల మధ్యకు పోయి నిలబడి వచ్చిరాని ఇభ్యు జాతివాళ్ళ భాషలో, "వృశ్చికనాయకా! నువు తొందరపడకు. కేసరి చేతిలో వున్న కత్తి పదును ముందు, నీ రాతిగొడ్డలి నిరుపయోగం. అసలీ పోట్లాటకు అర్థం లేదు. నువ్వింత వరకూ వృశ్చికమాత మందిరం ఎక్కడున్నదో కనుక్కోలేదు. అంతేకాక నాంగ్‌సోమ్ బతికి వున్నదీ లేనిదీ కూడా మనకు తెలియదు," అన్నాడు.

జాంగ్‌లా వృశ్చికనాయకుడికి అర్థమయ్యే విధంగా శిఖిముఖి అన్న మాటలు వివరించి చెప్పాడు. నాయకుడు కోపంతో ముక్కుపుటాలు అదురుతూండగా, "ఈ లంక నాది! ఇక్కడికి వచ్చిన వాళ్లంతా నా బానిసలు!" అన్నాడు.






కోపంతో విక్రమకేసరి కత్తి ఎత్తబోయేంతలో శిఖిముఖి అతణ్ణి ఆపి, "ఎవరూ ఎవరికీ యిష్టమై బానిసలు కారుగదా? మా కన్న శక్తిమంతుడవని రుజువు చేసుకుని మాత్రమే నువ్వు మమ్మల్ని బానిసలుగా చేసుకోగలవు. నీ మంచి కోసం చెబుతున్నాను; చూడు; ఈ కత్తి, నీ రాతిగొడ్డలి కన్న పదునైనది, గట్టిది, బలమైనది. నీవు దీన్ని మించిన ఆయుధం, శక్తి సంపాయించుకున్న నాడు, మేము బహుశా నీకు బానిసల మవుతాం," అన్నాడు.

వృశ్చికనాయకుడికి, శిఖిముఖి చెప్పింది నాలుగు వాక్యాల్లో గబగబా చెప్పి, జాంగ్లా



కేసరి చేతిలో వున్న కత్తి మీద తన మణికట్టును గట్టిగా ఆనించి, పైకి తీసి బొటబొట కారుతున్న రక్తాన్ని వృశ్చిక నాయకుడికి చూపుతూ, "కత్తి పదును ఎలాంటిదో తెలిసిందా? యిక శిఖిదొర చెప్పినటు విను," అన్నాడు.

వృశ్చిక నాయకుడు కళ్ళెర్రజేసి, ఒక పొలికేక పెట్టి, చేతిలో వున్న రాతిగొడ్డలిని దూరంగా విసిరి, "ధర్మయుద్ధం! ఆయుధం లేకుండా వట్టి చేతులతో పోరాడుదాం," అంటూ రొమ్ము చరిచాడు.

కత్తి కిందకు జార్చి, వృశ్చికనాయకుడితో కలయబడేందుకు విక్రమకేసరి పోబోయేంతలో, శిఖిముఖి అతణ్ణి ఆపి, "ఈ వృశ్చిక తెగ నాయకుడితో పోరాడే హక్కు మరో తెగ నాయకుడి కొడుకుది! ఇతడి అనుచరుల్ని మాత్రం ఒక కంట కనిపెట్టి వుండండి," అంటూ వృశ్చిక నాయకుడి మీదికి లంఘించాడు.

ఇద్దరూ మహారోషంతో ముష్టిఘాతాలిచ్చుకుంటూ, ఒకళ్ళనొకళ్ళు కింద పడదోసేందుకు తీవ్రంగా పోరాడసాగారు. వృశ్చిక నాయకుడు దేహబలంలో శిఖిముఖి కన్న మిన్న అయినా, శిఖిముఖి కున్న నేర్పూ ఒడుపూ లేనందున, శిఖిముఖి





అతణ్ణి తల మీదా, రొమ్ముల మీదా బలంగా పొడిచి, చివరకు ఒక్క ఊపుతో నేల మీదికి పడదోసి, ఒక చేత్తో అతడి గొంతు బిగబట్టి, రెండవచేత్తో జుట్టు పట్టుకుని, తలను ఒకటి రెండుసార్లు నేలకు వేసి గట్టిగా కొట్టాడు.

వృశ్చికనాయకుడు కళ్ళు తేలవేస్తూ, చేతులు రెండూ పైకెత్తి చిన్న గొంతుతో ఏదో అనసాగాడు. జాంగ్‌లా అతడి పక్కన వంగి, ఆ మాటలు విని, శిఖిముఖితో, "శిఖి దొరా! ఇక వాణ్ణి ఒదలండి. ఆజన్మ బానిసనని వేడుకుంటున్నాడు," అన్నాడు.

శిఖిముఖి చప్పున లేచి నిలబడ్డాడు. వృశ్చిక నాయకుడు కూడా లేచి కూర్చుని ముందుకు వంగి శిఖిముఖి పాదాలు పట్టుకుని ఏమో గొణిగాడు. తమ నాయకుడు అలా చేయగానే వృశ్చికజాతి వాళ్ళంతా వున్న చోటనే ప్రాణాచారం పడ్డారు.

శిఖిముఖి, వృశ్చిక నాయకుణ్ణి లేవనెత్తి, "మనిషి మరో మనిషికి ఏ పరిస్థితుల్లోనూ బానిస కానవసరం లేదు. జరిగిపోయింది యిద్దరం మర్చిపోదాం. ఇక నుంచి మనం మిత్రులం!" అన్నాడు.

వృశ్చిక నాయకుడి కళ్ళ నుంచి నీళ్ళు జలజలా కింద రాలినై. అతడు శిఖిముఖికీ, విక్రమకేసరికీ తన కృతజ్ఞత




చెప్పుకుని, తన జాతివాళ్ళతో, "ఇకనుంచి మనకందరకీ నాయకుడు, యీ శిఖిదొర! ఆయన మాటకు తిరుగులేదు," అన్నాడు.

తరవాత అందరూ చెట్ల కింద కూర్చుని, వెంట తెచ్చుకున్న ఆహారం తిన్నారు. అప్పుడు శిఖిముఖి, విక్రమకేసరితో ముందు తాము చేయవలసిన పనిని గురించి సంప్రతించాడు. ఆ ఇద్దరికీ నాంగ్‌సోమ్ లోయలో ఎక్కడో సురక్షితమైన స్థానంలో పడి బతికే వుంటాడన్న నమ్మకం వున్నది. ఆ సంభాషణ విన్న జాంగ్‌లా, నాంగ్‌సోమ్ ప్రాణాలతో వుంటే, శిథిలాలయ పూజారి కూడా బతికే వుండొచ్చు అన్నాడు.







వేటాడవలసిన పనికూడా వున్నది. వెలుగు వుండగానే మనం ఆ లోయలోకి దిగుదాం," అన్నాడు శిఖిముఖి.

"మీ ఆజ్ఞ, దొరా! కాని, ఆ లోయ చాలా భయంకరమైనది. అక్కడ మహా సర్పాలూ, తేళ్ళే కాక, ఏనుగులూ, సింహాలూ, పులులూ...."

వృశ్చికనాయకుడు మాటలు ముగించక ముందే శిఖిముఖి అడ్డువచ్చి, "ఈ లంకలో భయంకరంగా కాక, ప్రశాంతంగా, సౌమ్యంగా వున్న ప్రదేశం ఎక్కడుంది? నువ్వనే వృశ్చికమాత మందిరం ఆ లోయలోనే గదా వున్నది. ఆ ఆలయాన్ని కనుక్కొని, తిరిగి వృశ్చికమాతకు పూజా పునస్కారాలు చేయవలసిన బాధ్యత మీ జాతి వాళ్ళకు మాత్రం లేదా?" అని అడిగాడు.

"ఆ మాత కోసం ప్రాణాలిస్తాం, దొరా! కాని, నేను వెర్రివెలగపండు తిని వున్నట్టయితే, పౌర్ణమినాడు మాతమందిరం చేరి, నరబలి యిచ్చి వుండేవాణ్ణి. నరబలి లేందే మాత కరుణించదు," అన్నాడు వృశ్చిక నాయకుడు.

"ఆ బలుల సంగతి తరవాత మాట్లాడదాం. ముందు లోయలోకి దారి తీయండి." అన్నాడు శిఖిముఖి.

వృశ్చిక నాయకుడు తనకున్న శంకను మరోసారి బయట పెట్టాడు: వెర్రివెలగ పండు మహత్తు అమోఘమైనది. నాంగ్ సోమ్ లోయలోకి దూకేముందు శిథిలాలయం అంటూ కేకపెట్టటం మతిభ్రమవల్ల కాదు. అతడికి శిథిలాలయం కనబడే వుంటుంది!

"శిథిలాలయం మాట దేవు డెరుగు, ముందు ఆ లోయలోకి పోయి అతడు బతికున్నాడేమో చూసి, రక్షించవలసిన బాధ్యత మనమీద వున్నది. జాంగ్‌లా అన్నట్టు శిథిలాలయపూజారి కూడా ఏ చెట్టు కొమ్మల్లోనో సురక్షితంగా దిగివుంటే, వాణ్ణి





అందరూ కొండమీది నుంచి లోయలోకి దిగసాగారు. వృశ్చికనాయకుడు ముందు ఉండి దారితీశాడు. అతడు చెప్పినట్టు లోయ చాలా భయంకరంగా వున్నది. అక్కడ వున్న మహావృక్షాల్లో ఎక్కువ భాగం పెద్దపెద్ద ఊడలు దించుకున్న మర్రి చెట్లు. వాటి నీడల్లో ఏనుగులు తారట్లాడు తున్నవి. మరి కొన్నిచోట్ల సింహాలు కోరలు సాచి గర్జిస్తున్నవి. చెట్లకొమ్మల్లో మహా సర్పాలూ, వాటి బోదెల నంటుకుని పెద్ద పెద్ద తేళ్ళూ పారాడుతున్నవి.



శిఖిముఖీ అతడి అనుచరులూ ఆయుధాలు సిద్ధంగా వుంచుకుని, తమ పరిసరాలు జాగ్రత్తగా పరీకించి చూసుకుంటూ లోయ అడుగుకు చేరారు. శిఖిముఖి చెప్పగా, వృశ్చిక నాయకుడు కొండమీది నుంచి నాంగ్‌సోమ్ కిందికి దూకిన ప్రాంతానికి దారితీశాడు. ఆ ప్రదేశమంతా ఎత్తయిన వృక్షాలతో, వాటిని చిక్కగా అల్లుతూ పెరిగిన లతలతో క్రిక్కిరిసి వున్నది.

వృశ్చిక నాయకుడు తల ఎత్తి చెట్ల కొమ్మల కేసి చూస్తూ కొంత దూరం నడిచి, చప్పున ఆగి, "దొరా! నాంగ్‌సోమ్ దూకిన కొండ అంచు దిగువన మనం వున్నాం. అదుగో, ఆ కొమ్మల్లో ఏదో ఆకారం కనబడుతున్నది. కాని, చెట్టును సమీపించటం ప్రమాదం, శిఖి దొరా! దానికింద ఏనుగు కుటుంబం కాపరం పెట్టినట్టున్నది," అన్నాడు.

శిఖిముఖీ, విక్రమకేసరీ తల ఎత్తి పైకి చూశారు. వాళ్ళకుకూడా చెట్టుకొమ్మల్లో ఏదో మానవాకారం లాంటిది అస్పష్టంగా కనబడింది. అది నాంగ్‌సోమ్ అవునో కాదో తేల్చుకోవాలంటే, ముందు చెట్టుకింద వున్న ఏనుగుల్ని బెదరకొట్టి పారదోలాలి. ఇంతా చేస్తే, ఆ కనబడేది నాంగ్‌సోమ్ కాక కొండమీంచి కాలుజారి పడిన ఏ ఎలుగుబంటో కావచ్చు........



శిఖిముఖి, విక్రమకేసరీ యిలాంటి సంశయాలతో కొట్టుమిట్టాడుతూండగా ఎర్రగండు పెద్దగా మొరిగింది. కుక్క అరవటం, అది తలఎత్తి చూస్తూన్న దిక్కూ గమనిస్తూనే శిఖిముఖికి ఆ చెట్టుకొమ్మల్లో చిక్కుకుని వున్న ఆకారం నాంగ్‌సోమ్ అయివుంటుం దన్న నమ్మకం కలిగింది.

"కేసరీ ! మనం నేర్పుగా ఆ చెట్లకింద వున్న ఏనుగుల్ని దూరంగా తరమాలి. తరవాత చెట్టెక్కి, ఆ కనబడేది నాంగ్‌సోమే నేమో చూడవచ్చు," అన్నాడతను.

శిఖిముఖి మాట ముగించే లోపలే, చెట్టు కింద వున్న ఏనుగుల్లో రెండు పెద్దవి, భయంకరంగా ఘీంకరించి, తొండాలెత్తి వాళ్ళ కేసి రాసాగినై. అది చూస్తూనే వృశ్చికనాయకుడు, "అందరూ త్వరగా ఆ రాళ్ళ చాటుకు పరిగెత్తండి. అక్కణ్ణుంచి బండ రాళ్ళు తోసి ఏనుగుల్ని బెదరకొట్టటం సాధ్యమేమో చూద్దాం," అన్నాడు.

ఆ హెచ్చరిక వింటూనే అందరూ కొండ అంచున వున్న రాళ్ల వెనక్కు పారి పోయారు. ఏనుగులు చెవులు టపటప లాడిస్తూ, తొండాలతో నేలను తాటిస్తూ, వాళ్ళు దాగివున్న వైపుకు కొంతదూరం పరిగెత్తుకు వచ్చి, అక్కడ వున్న బండ రాళ్ళ మధ్య కాళ్ళకు పట్టు దొరక్క వెనక్కు పోసాగినై. అదే అదనుగా శిఖి ముఖివాళ్ళు అక్కడ అసనాటుగా వున్న బండరాళ్ళను వాటి కేసి దొర్లించారు. ఏను గులు ఘీంకరిస్తూ వెనుదిరిగి అక్కణ్ణించి దూరంగా పరిగెత్తినై.

ఇప్పుడు అందరూ రాళ్ళ చాటునుంచి బయటికి వచ్చి, జాగ్రత్తగా చెట్ల కిందికి పోయారు. వృశ్చికనాయకుడు తన జాతి వాణ్ణొకణ్ణి చెట్టెక్కమని చెప్పేంతలో కుంటి జాంగ్‌లా పట్టుకర్రను చెట్టుబోదెకు ఆనించి, కోతిలా చెట్టు మీదికి గబగబా ఎగబాకి పోయాడు. —(ఇంకా వుంది)





# ముగ్గురు రాణులు

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు ఎవరియందు విశ్వాసం ఉంచి ఇలా శ్రమపడుతున్నావో తెలియదు. కాని వారి విశ్వాసపాత్రత నిర్ణయించటం నీ విధి. లేని పక్షంలో మయుంకదేశపు రాజైన సుజిత వర్మ లాగా చిక్కులో పడగలవు. శ్రమ తెలియకుండా ఉండగలందులకు నీకు అతని రాణుల కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

మయుంకదేశపు రాజకుమారుడు సుజిత వర్మ. మయుంకదేశపు రాజులకు, ప్రథగా రాజకుమార్తెలు పట్టపురాణులుగా ఉండటం అనేక తరాలుగా జరుగుతున్నది. రెండు రాజవంశాలూ గొప్ప వంశగౌరవం

## బేతాళ కథలు



గలవి. అందుచేత ఈ ఆచారాన్ని ఉభయ రాజ్యాలవారూ పాటిస్తూ వచ్చారు.

ఆ కారణం చేత ప్రభగా రాజకుమారి సౌదామనీదేవి యుక్త వయస్కురాలు కాగానే ఆమెను సుజితవర్మ కిచ్చి పెళ్ళి చేశారు. అయితే సుజితవర్మ అప్పటికి పధ్నాలుగేళ్ళవాడు. సౌదామనీదేవి అతని కన్న అంతో ఇంతో వయసులో పెద్దది.

సుజితవర్మ తన ఇరవై అయిదవ ఏట రాజ్యాభిషిక్తు డయినప్పుడు సౌదామనీదేవి అతనికి పట్టపురాణి అయింది.

సుజితవర్మ రాజ్యాభిషిక్తుడైన కొద్ది కాలానికే విదర్భ రాజకుమార్తె సౌమ్యలతకు స్వయంవరం జరిగింది. ఆ స్వయంవరానికి అనేకమంది ఇతర రాజులతోబాటు సుజితవర్మ కూడా వెళ్ళాడు.

స్వయంవర మండపంలోకి సౌమ్యలత అడుగు పెట్టగానే సుజితవర్మకు ఆమెపై అమితమైన మోహం కలిగింది. కాని సౌమ్యలత ఒక్కొక్క రాజునే దాటిపోతూ సుజితవర్మను కూడా దాటి ముందుకు పోయింది. కారణమేమంటే ఆమె అదివరకే మరొక రాజకుమారుణ్ణి ప్రేమించి, అతని మెడలో వరమాల వేయ నిశ్చయించుకుని ఉన్నది.

అయితే పౌరుషవంతుడైన సుజితవర్మ, తనను సౌమ్యలత వరించక పోవటం తీరని అవమానంగా భావించి, ఆమెను చెయ్యి పట్టి నిలిపి, "నేనీమెను బలాత్కారంగా తీసుకు పోబోతున్నాను. అభ్యంతరం ఉన్నవాళ్ళు నాతో యుద్ధానికి రావచ్చు!" అని గట్టిగా అన్నాడు.

సుజితవర్మతో పోరాటానికి మిగిలినవారెవరూ సాహసించలేదు, కాని ఆమెను ప్రేమించిన యువకుడు లేచి కత్తి దూసి, "రాజకుమారి మానరక్షణకు నేను సిద్ధంగా ఉన్నాను. నాకు సాయం వచ్చేవారెవరైనా ఉంటే రండి!" అన్నాడు.

అతనికి ఎవరూ సాయం రాలేదు. అతను ఒక్కడే సుజితవర్మతో యుద్ధం చేసి, ప్రాణాలు వదిలాడు. తరవాత సుజితవర్మ సౌమ్యలతను తన నగరానికి తీసుకు పోయి తనకు రెండవ రాణిని చేసుకున్నాడు.

ఇది జరిగిన కొన్ని ఏళ్ళ అనంతరం సుజితవర్మ అరణ్య ప్రాంతానికి వేటకు వెళ్ళి, అక్కడ ఒక కొలనులో స్నానం చేస్తున్న అటవిక కన్యను చూసి, అసాధారణమైన ఆమె యౌవన సౌందర్యానికి మతి చెడినవాడై, బలాత్కారంగా ఆమెను చెరిచాడు.



ఈ సంగతి క్షణాల మీద ఆటవికులకు తెలిసి, కొన్ని వందలమంది ఆటవికులు ఈటెలూ, బాణాలూ పట్టుకుని వచ్చి రాజును చుట్టుముట్టారు. రాజు వెంట వచ్చిన పరివారులు వారిని ఎదిరించ లేకపోయారు.

సుజితవర్మ తాను చేసిన పనికి శిక్ష తప్పదని గ్రహించి, ఆ ఆటవిక కన్యను పెళ్ళాడి తన మూడవ రాణిగా చేసుకుని, ఆమె బలగానికంతకూ బహుమానాలు పంచి, వారిని మంచి చేసుకున్నాడు.

తన ముగ్గురు రాణులతోనూ సుఖంగా కాపరం చేస్తూ సుజితవర్మ రాజ్యపాలన చేస్తూ ఉండగా అతని గృహానికి ఒకనాడు ఒక సిద్ధుడు వచ్చాడు. ఆయన భోజనం చేసేటప్పుడు ముగ్గురు రాణులూ ఆయనకు వడ్డన చేయ వచ్చారు. కాని సిద్ధుడు వారు వడ్డించటానికి ఒప్పుకోక, మామూలు సేవకుల చేతనే వడ్డన చేయించుకుని భోజనం ముగించాడు.

అనంతరం రాజు సిద్ధుడితో ఏకాంతంగా కూర్చుని మాట్లాడుతూ, "స్వామీ, మీకు వడ్డన చేయమని నేనే నా భార్యలను అజ్ఞాపించాను. వారిని ఎందుకు వడ్డన చేయ నిచ్చారు కారు?" అని అడిగాడు.

సిద్ధుడు రాజు కేసి తేరిపార జూసి, "రాజా, నీ భార్యలతత్వం నీ కన్న నాకే



ఒకతె విసర్జించదగినది అని మాత్రం చెప్ప గలను. ఆమె ఎవరో నువే తెలుసుకుని, సాధ్యమైనంత త్వరలో పంపి వెయ్యి," అన్నాడు సిద్ధుడు.

"నాకు ఏ ఒకరి గురించీ అనుమానం లేదు. వారిలో ఒకతె నమ్మదగనిదని మీరు రుజువు చెయ్యగలిగితే—" అన్నాడు రాజు.

"రుజువు చెయ్యటం ఏమంత కష్టం కాదు. నేను చెప్పినట్టు చెయ్యి," అని సిద్ధుడు రాజుకు ఒక ఉపాయం చెప్పాడు.

మరి కాస్సేపటికి, రాజు తీవ్రమైన గుల్మవ్యాధితో బాధపడుతున్నట్టూ, త్వరలో చికిత్స జరగకపోతే ప్రాణాపాయం కలిగే టట్టూ రాజభవనంలో వార్త పుట్టింది.

అందరూ వచ్చి సిద్ధుణ్ణి, "స్వామీ, ఈ వ్యాధికి చికిత్స ఏమిటి?" అని అడిగారు.

"రాజపత్నులు తమ కాళ్ళు కడుగుకొని ఆ నీరు పంపితే, రాజు ఆ నీరుతాగితే వ్యాధి నివారణ అవుతుంది," అన్నాడు సిద్ధుడు.

వెంటనే ఒక దాసీది ముగ్గురు రాణుల అంతఃపురాలకూ వెళ్ళి బంగారు కలశాలతో పాదప్రక్షాళనోదకం తెచ్చింది. అయితే రెండు కలశాలే ఉన్నాయి.

"మహారాజా, పెద్దరాణీగారు నీరు ఇవ్వ మనేశారు!" అన్నది దాసీది.

బాగా తెలుసులాగున్నది. వారిలో ఒకతె ఎంత మాత్రమూ విశ్వసించ దగిన మనిషి కాదు," అన్నాడు.

రాజు నిర్ఘాంతపోయాడు. అతను ముగ్గురు భార్యల పట్లా సమబుద్ధితోనే నడుచుకుంటు న్నాడు. వారు కూడా అతనిపట్ల అలాగే ఉంటున్నారు. వారిలో వారికి కూడా ఎలాటి కలతలూ, ఈర్ష్యలూ ఉన్నట్టు లేవు.

"స్వామీ, మీ మాటలు చాలా చిత్రంగా ఉన్నాయి. నా భార్యలలో విశ్వసించరానిది ఎవరు?" అని రాజు సిద్ధుణ్ణి అడిగాడు.

"నాకు వారు విడి విడిగా తెలియదు, నాయనా? నాకు వడ్డించ వచ్చిన వారిలో

రాజు ఆమెను పంపేసి, "స్వామీ, నమ్మదగని మనిషి నా పట్టమహిషి అవుతుందా? ఆమె తన కాళ్ళు కడిగిన నీరు ఇవ్వ నిరాకరించటానికి ఏమిటి కారణం? నేను ఈ రోగంతో చనిపోవాలనా?" అని సిద్ధుణ్ణి అడిగాడు.

"రాజా, తొందరపడకు. రెండు కుక్కలను తెప్పించు," అన్నాడు సిద్ధుడు. రెండు కలశాలలోని నీరూ రెండు పళ్ళాలలో పోసి, రెండు కుక్కలచేత తాగించారు. అందులో ఒక కుక్క గిలగిలా తన్నుకుని చచ్చింది.

"చూశావా, రాజా? ఈ కలశం పంపిన భార్య విసర్జించదగినది. ఆమె వల్ల నీకు ఎప్పటికైనా ప్రాణాపాయం ఉన్నది," అన్నాడు సిద్ధుడు.

రాజు తన బుద్ధి ఉపయోగించి ఆ కలశం పంపినది తన రెండవ భార్య అయి ఉంటుందని గ్రహించి, ఆమెను విసర్జించి, మిగిలిన ఇద్దరు భార్యలతోనూ చాలాకాలం సుఖంగా ఉన్నాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, నాకు కొన్ని సందేహాలున్నాయి. రాజు తన పెద్ద భార్యను శంకించినప్పుడు సిద్ధుడు ఆ అనుమానాన్ని ఎందుకు తోసిపుచ్చాడు? ఆమె పాదోదకం ఎందుకు పంపలేదు? కాళ్ళు కడుగుకుని ఆ నీటిలో విషం కలిపినది తన



రెండవ భార్య అని రాజు ఎట్లా నిర్ణయించాడు? ఈ సందేహాలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "నీరు పంపక పోవటాన్ని బట్టి పెద్దరాణి నిర్దోషి అన్నది స్పష్టమవుతున్నది. తన పాదోదకంతో రాజుకు వ్యాధి నివారణ కలగకూడదన్నదే ఆమె ఉద్దేశమైతే ఆమె మామూలు నీరైనా పంపి ఉండవచ్చు. ఒకవేళ రాజు జబ్బుతో చనిపోతే అపఖ్యాతి తనకు చుట్టుకునే ప్రమాదం ఉన్నదని తెలిసి కూడా ఆమె నీరు పంప నిరాకరించింది. నిజానికి రాణుల పాదోదకంతో రాజు వ్యాధి నయమవుతుందన్న మాట నమ్మగలది మూడవ రాణి మాత్రమే. ఆమె జన్మతః ఆటవిక స్త్రీ. సంస్కారం గలది కాదు. పెద్దరాణి లాగే రెండవరాణి కూడా తన పాదోదకాన్ని నమ్మి ఉండదు. అయితే రాజును చంపటానికి పాదోదకం మంచి సాధనంగా ఆమెకు దొరికింది. నీరుతాగి కూడా రాజు చచ్చిపోతే రోగం నయంకాక చచ్చిపోయినట్టు అందరూ అనుకుంటారు. ఒకవేళ రాజు తాగిన నీటిలో విషం ఉన్నట్టు ఏ వైద్యుడైనా శంకించినా అది ఏ రాణి పంపిన నీరో నిర్ణయించటం సులభం కాదు. పోతే, రాజును చంపాలన్న ఉద్దేశం పెద్దరాణికి ఉండదు. ఆమె పరువు మర్యాదలు గల వంశంలో పుట్టినది, అభిజాత్యం గల స్త్రీ. అనవాయితీ కోసం తన కన్న చిన్న భర్తను చేసుకోవటం ఆమెకొక త్యాగంలాగా తోచదు. మూడవ రాణి రాజును పెళ్ళాడి ఉన్నత స్థితికి వచ్చింది. రాజు వల్ల తన ప్రియుణ్ణి కోల్పోయిన విదర్భ రాజకుమార్తె సామ్యులతే అన్ని విధాలా అనుమానించదగినది," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# కురూపి రాజకుమార్తె

ఒక గ్రామంలో ఒక రైతు ఉండేవాడు. ఆ రైతుకు ముగ్గురు కొడుకులు. వాళ్ళకు యుక్తవయను రాగానే రైతు, "మీరు ఒక్కొక్కరే దేశంమీద వెళ్ళి, డబ్బు సంపాదించుకుని, మీకు నచ్చిన కన్యను పెళ్ళాడి, తిరిగి రండి. నాకున్న ఆస్తి పంచుకుంటే మీకేమీ రాదు. ఆస్తి లేని మీకు పిల్లల నెవరిస్తారు?" అన్నాడు.

తండ్రి చెప్పినప్రకారం పెద్దవాడు మొట్ట మొదట దేశాటనకు బయలుదేరాడు. తండ్రి వాడికి దారి ఖర్చులకు కొంత డబ్బు ఇచ్చాడు. తల్లి వాడికి దారిలో తినటానికి ఆహారం మూటకట్టి ఇచ్చింది.

పెద్దవాడు ప్రయాణమై వెళుతుండగా దారిలో ఒక మనిషి కనిపించి, తనతో జూదం ఆడమన్నాడు. జూదం ఆడి డబ్బు సంపాదిస్తే తాను బయలుదేరిన పని సగం పూర్తి అవుతుందనీ, డబ్బు సంపాదించుకున్నాక చక్కని కన్యను సులువుగా పెళ్ళాడ వచ్చుననీ పెద్దవాడు ఆశపడి, ఆ జూద గాడితో ఆడటానికి ఒప్పుకున్నాడు.

అయితే జూదంలో పెద్దవాడు తన దగ్గిర ఉన్న డబ్బంతా పోగొట్టుకున్నాడు. చేసేది లేక వాడు ముందుకు సాగివెళ్ళి, మధ్యాన్నం వేళకు ఒక చెరువుగట్టు చేరి, అక్కడ భోజనం చేద్దామని కూర్చున్నాడు.

పెద్దవాడు తన ఆహారం మూట విప్పు తూండగా ఎవరో స్త్రీ అతని దగ్గిరికి వచ్చి, "ఆకలిగా ఉంది, నాకు కూడా కొంచెం తిండి పెడతావా?" అని అడిగింది. ఆమె వికారంగా ఉన్నది.

"సరే కూర్చో," అన్నాడు పెద్దవాడు.

ఇద్దరూ కూర్చుని తిండి తినేటప్పుడు, "నువు ఎవరు? ఏం పనిమీద బయలు దేరావు? ఎక్కడికి పోతున్నావు?" అని ఆ స్త్రీ అడిగింది.

ఎస్. పద్మనాభరావు



'' నేను మంచి ధనవంతురాలైన కన్యను పెళ్ళాడాలని బయలుదేరాను. వేరే పని ఏమీ లేదు,'' అన్నాడు పెద్దవాడు.

'' నన్ను పెళ్ళాడతావా? నేనొక రాజ కుమార్తెను,'' అన్నదామె.

పెద్దవాడు ఆమె కేసి చూసి అసహ్య పడుతూ, '' ఇంత అనాకారిగా ఉన్నావు, నువు ఏ దేశపు రాజకుమార్తెవు? నీ మాట నేను నమ్మను. నా భార్య అందంగా కూడా ఉండాలి. డబ్బూ, అందమూ ఉన్న కన్య ఎక్కడన్నా ఉంటే చెప్పు,'' అన్నాడు.

'' ఈ దిక్కుగా బయలుదేరి వెళ్ళావంటే సూర్యాస్తమానం వేళకు ఒక పాతకోట వస్తుంది. దాని తలుపులు మూసి ఉంటాయి. బయట ఒక గంట ఉంటుంది. ఆ గంట కొట్టావంటే తలుపులు తెరుచుకుంటాయి. ఆ కోట లోపల అప్సరసల వంటి రాజ కుమార్తెలు ఇద్దరున్నారు. చాతనైతే వారిలో ఒకరిని పెళ్ళాడు,'' అని చెప్పింది ఆ కురూపి మనిషి.

పెద్దవాడికి ఆశ కలిగింది. వాడు వెంటనే బయలుదేరి, చీకటి పడేవేళకు ఒక నిర్జన మైన కోటను చేరుకున్నాడు. దాని తలు పులు మూసి ఉన్నాయి. వాటిని ఎంతసేపు బాదినా ఎవరూ పలకలేదు. కాని ఆ పక్కనే ఉన్న గంట కొట్టగానే తలుపులు వాటంతట అవే తెరుచుకున్నాయి.

పెద్దవాడు లోపలికి వెళ్ళాడు. లోపల కూడా నరసంచారం లేదు. కాని ఒక విశాల మైన సావడిలో అనేక శిలా ప్రతిమలు ఉన్నాయి. అవి స్త్రీలవీ, పురుషులవీనూ. వాటిని తయారుచేసినవాడు అద్భుతమైన శిల్పి అయి ఉండాలనుకున్నాడు పెద్దవాడు.

వాడా బొమ్మలను చూస్తూండగా వెనక నుంచి, '' ఎవరు నువు? ఏం కావాలి?'' అన్న ప్రశ్న వినపడింది.

పెద్దవాడు ఉలికిపడి వెనక్కు తిరిగి, చూడటానికి మహా అందవికారంగా ఉన్న

ఒక ముసలిదాన్ని చూశాడు. దాని చేతిలో ఒక బెత్తం ఉన్నది. అది నల్లని దుస్తులు ధరించి ఉన్నది.

"పెళ్ళాడే ఉద్దేశంతో కన్యను వెతుక్కుంటూ చాలా దూరం నుంచి వస్తున్నాను. ఇక్కడ అందమైన కన్యలున్నట్టు విన్నాను," అన్నాడు పెద్దవాడు.

"నీకు పెళ్ళి అయేటట్టు నేను చూస్తాను. నా ప్రశ్నలకు సరిఅయిన సమాధానం చెప్పు: సముద్రంకన్న లోతైన దేది? ముల్లు కన్న వాడి అయినదేది? అహారం కన్న విలువైన దేది?" అన్నదా ముసలిది. ఆమె ఒక ప్రసిద్ధ మంత్రగత్తె.

పెద్దవాడు సమాధానం చెప్పలేదు. ముసలిది ముందుకు వచ్చి, వాణ్ణి తన బెత్తంతో తాకింది. వెంటనే వాడు శిలగా మారిపోయాడు.

పెద్దవాడు బయలుదేరి వెళ్ళిన కొద్ది రోజులకు రెండోవాడు బయలుదేరాడు. వాడికి కూడా జూదగాడు తగిలి, తనతో జూదం ఆడమన్నాడు.

"నాకు జూదం ఆడటం రాదు. కావలిస్తే నా దగ్గిర ఉన్న డబ్బులో సగం యిస్తాను తీసుకో. నా దారిన నేను పోతాను," అన్నాడు రెండోవాడు.



జూదగాడు రెండోవాడి డబ్బులు సగం తీసుకుని, "విజయీ భవ! మరిచిపోకు, ఆహారం కన్న విలువైనది ఆశీర్వాదం!" అని తన దారిన తాను వెళ్ళిపోయాడు.

మధ్యాన్నానికల్లా రెండోవాడు చెరువు గట్టుకు వచ్చి, తన అహారం మూట విప్పాడు. ఎక్కడినుంచో ఒక అందవికారమైన స్త్రీ వచ్చి, "నాకు్కూడా కొంచెం తిండి పెడతావా? ఆకలిగా ఉన్నది," అన్నది.

"కావలిస్తే తిను, అభ్యంతరం లేదు," అన్నాడు రెండోవాడు.

ఆ స్త్రీ రెండోవాణ్ణి కూడా, పెద్దవాణ్ణి ప్రశ్నించినట్టే ప్రశ్నించింది.





రెండోవాడు కూడా ఆ చోటు చేరుకుని గంట కొట్టి లోపల ప్రవేశించి, అక్కడి విగ్రహాలను చూస్తూ, అందులో ఒకటి తన అన్నలాగా ఉండటం చూసి దిగ్భ్రాంతి చెందాడు.

ఆ సమయంలో మంత్రగత్తె వచ్చి తన ప్రశ్నలు వేసింది. వాటిలో, "ఆహారంకన్న విలువైనది ఏది?" అన్న ప్రశ్నకు సమాధానం తెలుసుననిపించింది గాని, కంగారులో అదేమిటో వాడికి జ్ఞాపకం రాలేదు. మంత్రగత్తె బెత్తం తీసుకుని తనని సమీపించే టప్పుడు వాడికి జరగనున్నది తెలిసి పరిగెత్త బోయాడు. ఇంతలోనే మంత్రగత్తె బెత్తం వాణ్ణి తాకి శిలగా చేసేసింది.

రెండోవాడు బయలుదేరిన కొద్ది మాసాలకు మూడోవాడు ఇంటి నుంచి బయలుదేరాడు. వాడికి కూడా దారిలో జూదగాడు ఎదురై, తనతో జూదమాడమన్నాడు.

"అన్నా, నేను చాలా డబ్బు సంపాదించే ఉద్దేశంతో ఇంటి నుంచి బయలుదేరాను. నా దగ్గిర ఉన్న కొద్ది డబ్బుకే ఆశపడి జూదం ఆడతానంటున్నావు. అందుచేత ఆ డబ్బంతా నువే తీసుకుని సుఖపడు." అంటూ మూడోవాడు తన డబ్బు సంచీని జూదరికి ఇచ్చేశాడు.

"నేను డబ్బు సంపాదించటానికీ, మంచి కన్యను పెళ్ళాడటానికీ బయలుదేరిపోతూ ఉన్నాను." అన్నాడు రెండోవాడు.

"నన్ను పెళ్ళాడతావా? నేనొక రాజకుమార్తెను!" అన్నది ఆమె.

"రాజకుమార్తెవైతే మాత్రం నీ వంటి కురూపిని ఎందుకు పెళ్ళాడతాను?" అన్నాడు రెండోవాడు.

"అలా అయితే నీకు అప్సరసల్లాంటి కన్యలున్న చోటు చెబుతాను. చాతనైతే వారిలో ఒకతెను పెళ్ళాడు." అంటూ ఆమె, పెద్దవాడికి చెప్పినట్టే, మంత్రగత్తె ఉండే కోట గురించి చెప్పింది.



"విజయీభవ! తమ్ముడూ, గుర్తుంచుకో—ఆహారంకన్న కూడా విలువైనది ఆశీర్వచనం!" అని జూదరి తన దారిన తాను వెళ్ళిపోయాడు.

మధ్యాహ్నం అయేసరికల్లా మూడోవాడు చెరువుగట్టు చేరుకొని, తన ఆహారం మూట విప్పాడు. ఎక్కడినుంచో ఒక అనాకారి స్త్రీ వచ్చి, "ఆకలిగా ఉన్నది, నన్ను కూడా తిననిస్తావా?" అన్నది.

"తప్పకుండా తిను. ఆకలి ముల్లుకన్న వాడి అయినది!" అన్నాడు మూడోవాడు.

ఆమె మిగతా ఇద్దరినీ అడిగినట్టే మూడో వాణ్ణి కూడా అడిగింది.

"మా బతుకులు మమ్మల్ని చూసుకోమనీ, మా పెళ్ళిళ్ళు మమ్మల్ని చేసుకోమనీ మా నాన్న అన్నదమ్ములను ముగ్గురినీ ఇంటి నుంచి పంపేశాడు. మా అన్న ఈపాటికి ఆ పని చేసే ఉంటారు. ఇక నా వంతు వచ్చింది!" అన్నాడు మూడోవాడు.

"నన్ను పెళ్ళాడరాదా? నేనొక రాజు కూతుర్ని!" అన్నది ఆ మనిషి.

"ఒక రాజకుమార్తె నన్ను పెళ్ళాడ గోరితే నేను కాదంటానా? తప్పక పెళ్ళాడతాను. నన్ను మీ ఇంటికి తీసుకు పో. మీ వాళ్ళతో మాట్లాడతాను." అన్నాడు మూడోవాడు.





"మావాళ్ళు ప్రస్తుతం ఒక పాడుపడిన కోటలో ఉన్నారు. నువు అక్కడికి ముందుగా వెళ్ళి, వాళ్ళను ఆ కోటలో నుంచి బయటికి తీసుకురా. నేను కూడా అక్కడికి తరవాత చేరుతాను," అంటూ ఆమె మంత్రగత్తె ఉండే కోటను గురించి వివరంగా చెప్పింది.

మూడోవాడు బయలుదేరాడు.

"మరిచిపోకు. నేను నిన్ను నిజంగా ప్రేమిస్తున్నాను. ప్రేమ సముద్రం కన్న లోతైనది!" అంటూ ఆ అనాకారి మనిషి ఎటో వెళ్ళిపోయింది.

మూడోవాడు కోట చేరుకుని, గంటకొట్టి, కోటలో ప్రవేశించి, లోపల ఉన్న విగ్రహాలలో తన అన్న లిద్దరినీ గుర్తించి, చాలా బాధపడ్డాడు.

ఇంతలో మంత్రగత్తె వచ్చి, "ఎవరు నువు? ఇక్కడి కెందుకు వచ్చావు?" అని అడిగింది.

"పెళ్ళి పనిమీద వచ్చాను!" అన్నాడు మూడోవాడు.

"నీకు పెళ్ళి నేను చేస్తాను. నేనడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పు," అని మూడు ప్రశ్నలూ వేసింది మంత్రగత్తె.

"సముద్రం కన్న లోతైనది ప్రేమ. ముల్లు కన్న వాడి అయినది ఆకలి. ఆహారం కన్న విలువైనది ఆశీర్వాదం," అన్నాడు మూడోవాడు.

"భేష్! అలా అయితే నన్ను పెళ్ళాడు," అన్నది ముసలి మంత్రగత్తె.

"తప్పక పెళ్ళాడతాను. అగ్నిసాక్షిగా పెళ్ళాడతాను. ఏర్పాటు చెయ్యి," అన్నాడు మూడోవాడు.

ముసలిది నేలమీద మంత్రదండంతో కొట్టేసరికి అగ్ని పుట్టింది.

"నీ చెయ్యి ఇలాతే! మనం అగ్ని చుట్టూ ఏడుసార్లు ప్రదక్షిణ చెయ్యాలి," అంటూ మూడోవాడు తన ఎడమ చేత్తో ఆమె కుడి చేతిని అందుకోబోయి, ఆమె

చేతిలోని బెత్తాన్ని లాగేసి, దాన్ని విరిచి మంటలో వేశాడు.

మరుక్షణమే మంత్రగత్తె పెద్ద కేక పెట్టి విరుచుకు పడిపోయింది. ఆమె ప్రాణాలు విడుస్తూండగానే శిలాప్రతిమ లన్నీ మనుషులుగా మారాయి. అదే క్షణంలో ఒక గొప్ప సౌందర్యవతి లోపలికి వచ్చింది. ఆమె తన తల్లి దండ్రులనూ, ఇద్దరు అక్కలనూ కలుసుకుని కౌగలించుకున్నది. అందరూ ఆనంద బాష్పాలు రాల్చారు. ఈ లోపల మూడోవాడు తన అన్నలను కలుసుకున్నాడు.

లోపలికి వచ్చిన సుందరి తనవాళ్ళను మూడోవాడి దగ్గిరికి తీసుకు వచ్చి, "ఇతనే మన అందరినీ కాపాడినవాడు, నేను ఇతన్నే పెళ్ళాడబోతున్నాను," అన్నది.

మూడోవాడు కంగారు పడి, "లేదు, లేదు. నేను ఒక రాజకుమార్తెకు పెళ్ళాడతానని మాట ఇచ్చాను. ఆమె నన్ను ప్రేమించింది," అన్నాడు.

సుందరి అతని మాటలకు నవ్వి, "ఆమె చాలా అనాకారి. ఆమె నెందుకు పెళ్ళాడతావు? నన్నే పెళ్ళాడు!" అన్నది.

"నీకు కృతజ్ఞత అయినా లేదా? ఆమె దయవల్లనే మీరంతా తిరిగి మనుష్యులయ్యారు! నా అన్నలు ఇద్దరూ తిరిగి నాకు దక్కారు!" అన్నాడు మూడోవాడు.

"నేనే ఆ కురూపిని. ఈ మంత్రగత్తె నా వారి నందరినీ శిలలుగా మార్చేసింది. నేను అదృష్టవశాన శిల కాకుండా తప్పించుకున్నాను. దూరంగా ఉండిపోయిన నన్ను ఈ దుర్మార్గురాలు అనాకారిగా మటుకు చేయగలిగింది," అన్నది సుందరి.

ఆమె తండ్రి అక్కడికి సమీపంలో ఉన్న నగరానికి రాజు. ఆయన రైతు కొడుకులను ముగ్గురినీ తన నగరానికి తీసుకుపోయి, తన ముగ్గురు కుమార్తెలనూ ముగ్గురన్నదమ్ములకూ ఇచ్చి పెళ్ళి చేశాడు. అంతా సుఖంగా ఉన్నారు.





# వెండిబాతుగుడ్డు

ఒక చిన్న దేశానికి ఒక రాజు ఉండేవాడు. ఆ రాజు కొక చక్కని కూతురుండేది. ఆమె పేరు ప్రమద. ఆ పిల్ల ఎప్పుడూ వింత వింత ఆలోచనలు చేసి, ఊహ ప్రపంచంలో విహరించేది. ఆమెకు తరచు కలలు వచ్చేవి. ఆ కలలు కూడా ఎంతో అందంగానూ, విచిత్రంగానూ ఉండేవి.

ప్రమదకు యుక్తవయసు వచ్చింది. ఆమె కోసం రాజూ, రాణీ సంబంధాలు విచారిస్తున్నారు.

"అమ్మాయి ఎప్పుడూ ఇంకేదో ప్రపంచంలో ఉంటుంది. దీని కెటువంటి మొగుడు వస్తాడో, ఏమో!" అని ప్రమద తల్లి దండ్రులు విచారించేవారు.

ఈ సమయంలో ప్రమద ఒక కల కన్నది. అంత వింత ఐన కల ఆమె కెన్నడూరాలేదు.

ఆ కలలో ఆమె ఒక అద్భుత లోకంలో ఉన్నది. అక్కడి చెట్లు బంగారు చెట్లు. వాటి ఆకులు బంగారంతో చేసినవి. వాటి పూలు కెంపులతోనూ, నీలాలతోనూ తయారయినవి. అక్కడ నెమళ్ళు నృత్యం చేస్తున్నాయి. వాటి పింఛాల నిండా రంగు రంగుల రత్నాలున్నాయి. చందనం చెక్కలు పరిచిన దారుల వెంట ప్రమద సంచరిస్తూ అక్కడి సౌందర్యానికి ఆనందిస్తున్నది.

ఇంతలో ఒక చిత్రం జరిగింది. ఒక బంగారు బాతు ఎక్కడి నుంచో వచ్చి అంత దూరాన వాలింది. ఎవరో యువకుడు అకస్మాత్తుగా ఆ బాతు దగ్గిరికి వచ్చాడు. అంతలో ఆ బాతు ఎగిరిపోయింది. అది వాలిన చోట ఒక గుడ్డున్నది. ఆ యువకుడు ఆ గుడ్డును తీసుకుని, ప్రమదను సమీపించి, ఆమె చేతిలో ఆ గుడ్డు పెట్టి, ఎటో వెళ్ళిపోయాడు.

ప్రమద ఆ బాతుగుడ్డు కేసి చూసింది. అది వెండి గుడ్డు!

---

ఏ. సి. సర్కార్, ఇంద్రజాలికుడు

---

మర్నాడు ప్రమద ఈ కలను గురించి అందరికీ చెప్పి, అది మామూలు కలకాదనీ, తాను కలలో చూసిన ప్రదేశం ఎక్కడో ఉన్నదనీ, ఆ కలలో తనకు వెండిగుడ్డు ఇచ్చిన యువకుడే తనకు భర్త అవుతాడనీ మొండిగా వాదించింది. చివరకామె, వెండి బాతుగుడ్డు తెచ్చి ఇచ్చినవాణ్ణి తప్ప పెళ్ళాడనని కూడా శపథం చేసింది.

ఆమె తల్లిదండ్రులకు ఏమి చెయ్యాలో తోచలేదు.

"తల్లీ, నీకు కలలో కనిపించిన వాడెలా ఉన్నాడో చెప్పు. అలాటివాణ్ణే చూసి పెళ్ళి చేస్తాము," అన్నారు తల్లిదండ్రులు.

"నాకు గుర్తు లేదు. కాని వెండి బాతు గుడ్డు తెచ్చినట్టయితే ఆ మనిషిని నేను గుర్తించగలుగుతాను," అన్నది ప్రమద.

ప్రమద వెండి బాతుగుడ్డు తెచ్చినవాణ్ణి తప్ప పెళ్లాడదని తెలియగానే అనేకమంది రాజకుమారులు నిట్టూర్పులు విడిచి, ఆమెను పెళ్ళాడే ఆశలు వదులుకున్నారు. కొద్దిమంది వెండి బాతుగుడ్డు ఎక్కడన్నా దొరుకుతుందేమోనని వెతకటం కూడా మొదలు పెట్టారు.

ప్రమదను పెళ్ళాడాలని గాఢంగా వాంఛించిన వారిలో విజయుడనే రాజకుమారుడున్నాడు. అతను ప్రమదకు వచ్చిన కల



గురించి వినగానే తమ ఆస్థానంలో ఉండే ఇంద్రజాలికుడి వద్దకు వెళ్ళి, "వెండి బాతు గుడ్డు కావాలి. ఏమిటి సాధనం?" అని అడిగాడు.

ఇంద్రజాలికుడు కొన్ని పుస్తకాలు తిరగ వేసి, ఒక ప్రక్రియ కనిపెట్టాడు. ఆయన ఒక మామూలు బాతుగుడ్డు తీసుకుని, విజయుణ్ణి వెంట బెట్టుకుని తన ప్రయోగ శాలలోకి వెళ్ళాడు. గుడ్డును శుభ్రంగా తుడిచి, ఆరబెట్టి, నూనె దీపం పొగ మీద గుడ్డుకు మసి పట్టించాడు. పట్టుకారుతో తిప్పుతూ గుడ్డు పూర్తిగా, అన్ని పక్కలా, మసి అయేటట్టు చేశాడు. తరవాత ఒక గాజు పాత్రలో నీళ్ళు పోశాడు. పట్టుకారు తోనే ఆ గుడ్డును ఎత్తి నీటిలో మునిగేటట్టు ఉంచాడు. వెంటనే ఆ గుడ్డు వెండితో చేసిన గుడ్డు లాగా మెరవసాగింది.

"దీనిని ఇలాగే తీసుకుపోయి రాజ కుమార్తెకు చూపించు. ఆ గుడ్డును తాకినా, నీటిలో నుంచి పైకి తీసినా దాని ప్రభావం పోతుందని ఆమెతో చెప్పు. ఆమెను పెళ్ళాడి, వెంట పెట్టుకురా!" అని ఇంద్రజాలికుడు విజయుణ్ణి ఆశీర్వదించాడు.

వెండి బాతుగుడ్డును చూసి ప్రమద తన్మయత్వం చెందింది. ఆమె ఆ గుడ్డును నీటి నుంచి పైకి తీయబోతే విజయుడు వారించి, "ఇది ఈ లోకానికి చెందినది కాదు. మనం తాకితే దీని ప్రభావం పోతుంది," అన్నాడు. ఆమె అతని కేసి చూసి, తనకు కలలో కనిపించినది అతనే నన్నది.

ప్రమద తల్లిదండ్రులు పరమానంద భరితులై, ప్రమదను విజయుడి కిచ్చి పెళ్ళి చేశారు. తరవాత విజయుడు తన భార్యకు తాను చేసిన యుక్తి చెప్పాడు. ప్రమద అతన్ని క్షమించింది.

విజయుడు చేసిన ట్రిక్కు మనమూ చెయ్యవచ్చు.





# మాయదారి ముసలిది

హారూనల్ రషీద్ బాగ్దాద్‌లో ఖలీఫాగా ఉండిన కాలంలో ఆ రాజ్యంలో పావురాల టపా నడిచింది. దాన్ని నడపటానికి ఖలీఫా ఒక సమర్థుణ్ణి నియమించి నెలకు వెయ్యి దీనారాల జీతం ఇచ్చాడు.

అయితే కొంతకాలానికి ఆ మనిషి చనిపోయాడు. అతనితోనే పావురాల టపా కూడా నిలిచిపోయింది. ఆ టపా నిమిత్తం ఏర్పాటయిన పావురాలూ, నలభైమంది నీగ్రో బానిసలూ, నలభై వేటకుక్కలూ ఖలీఫా వద్దకు తిరిగి వచ్చేశాయి.

ఆ పావురాల టపా నడిపినవాడికి దిలైలా అనే భార్యా, జీనాబ్ అనే కూతురూ ఉండేవారు. తన భర్త చనిపోగానే దిలైలా ఖలీఫాకు ఒక విజ్ఞాపన చేస్తూ, పావురాల టపా తాను నిర్వహించగలననీ, తన భర్తకు ఇస్తూ ఉండిన జీతమే తనకూ ఇవ్వవలసిందనీ వేడుకున్నది. కాని ఆమె విజ్ఞాపనను ఖలీఫా తిరస్కరించాడు. దిలైలా శక్తిసామర్థ్యాలను ఆయన ఎరగడు.

ఇది జరిగిన కొద్ది రోజులకే ఖలీఫా ఇద్దరు ప్రసిద్ధులైన దొంగలను కొత్వాళ్ళుగా నియమించాడు. ఒకడు అహ్మద్, రెండోవాడు హసన్. వారిని పట్టటానికి విశ్వప్రయత్నాలు చేసి విఫలుడై; అంత సమర్థత గల దొంగలు కొత్వాలు పనిని చక్కగా నిర్వర్తించగలుగుతారని ఖలీఫా భావించాడు.

తన విజ్ఞాపనను తోసిపుచ్చిన ఖలీఫా దొంగలకు గొప్పపదవు లిచ్చేసరికి దిలైలాకు చాలా ఆగ్రహం వచ్చింది. "ఈ దేశంలో దొంగలకూ, మోసగాళ్ళకూ గౌరవమర్యాదలు లభించే పక్షంలో, మనమేనా చేతగానివాళ్ళం? ఈ హసన్‌గాని, అహ్మద్‌గాని నా ముందు ఎందుకూ పనికిరారని రుజువు చేస్తాను, చూసుకో!" అన్నదామె తన కూతురు జీనాబ్‌తో.

అర్. నాగభూషణం



దిలైలా వయసు మళ్ళినదే అయినా యుక్తిలో చాలా గట్టిది. జీనాబ్ కూడా తల్లికేమాత్రమూ తీసిపోదు. తల్లి అన్న మాటలకు ఆమె చాలా సంతోషించింది.

తన మాయలతో బాగ్దాద్ నగరాన్ని అట్టుడికించాలని దిలైలా నిశ్చయించింది. ఒకనాడామె మెడనిండా తావళాలూ, ముఖానికి ముసుగూ, చేతిలో సూఫీ బిచ్చగాళ్ళ జెండా ధరించి, సూఫీ సన్యాసిని అవతారంతో ఇంటి నుంచి బయలుదేరింది.

ముస్తఫా అనేవాడు బాగ్దాదులోని గొప్ప అధికార్లలో ఒకడు. అతను ఖలీఫా రక్షక దళానికి నాయకుడు. అతనికి పెద్ద జీతం ఉండేది. బ్రహ్మాండమైన చక్కని ఇల్లు ఉండేది. దానికి గంధం చెక్కతో చేసిన తలుపులూ, వెండి తాళాలూ ఉండేవి. ముస్తఫా ఐశ్వర్యానికి తగ్గట్టే అతనికి మంచి యవ్వనంలో ఉన్న, అందాలరాశి అయిన భార్య ఉండేది. ఆమె పేరు ఖాతూన్. ఆ భార్యను ముస్తఫా నెత్తిమీది దేవతలాగా చూసుకునేవాడు. అందుకే, ఆమె వల్ల తనకు సంతానం కలగకపోయినా అతను మరొక భార్యను కట్టుకోలేదు. అయితే, సాటి అధికారుల్లాగా తన వెంట దివానానికి తీసుకుపోవటానికి కొడుకులు లేరే అని లోలోపల బాధపడేవాడు,

పిల్లల కోసం తన భర్త కుమిలిపోతున్న సంగతి ఖాతూన్ ఎరుగును. అందుచేత తనకు పిల్లలు లేరన్న విచారంతో ఆమె కూడా బాధపడి, సంతానం కోసం ఎన్నో మందులు తిని, ఎన్నో తిప్పలు పడింది. అయితే ఆమె ప్రయత్నాలు ఫలించలేదు.

సూఫీ సన్యాసిని వేషంలో, "అల్లా! అల్లా!" అని కేకలు పెడుతూ, నగరం వీధుల వెంబడి తిరుగుతున్న దిలైలా, ముస్తఫా ఇంటి ముందుకు వచ్చి తల ఎత్తి చూసింది. మేడ మీద కిటికీ వద్ద నిలబడి ఉన్న ఖాతూన్ అంతులేని ఆభరణాలు

ధరించి, కొత్త పెళ్ళికూతురి లాగా వెలిగి పోతూ దిలైలా కంటపడింది.

"ఈ పిల్లను తీసుకుపోయి ఆ నగలన్నీ కాజెయ్యకపోతే నా ప్రజ్ఞ ఏమిటి?" అను కున్నది దిలైలా.

దిలైలాను చూడగానే ఖాతూన్‌కు కూడా ఆశ కలిగింది. ఈ సూఫీ సన్యాసిని తన కేమైనా సంతానప్రాప్తి కలిగే మార్గం చెబు తుందేమో! ఆ సన్యాసినిని పిలుచుకు రమ్మని ఖాతూన్ ఒక దాసీని పంపింది.

దాసీది వెళ్ళి దిలైలాను మేడ మీదికి తెచ్చింది. ఖాతూన్ కళ్ళనీళ్ళు పెట్టు కుని దిలైలా కాళ్ళపైన పడి, తన సమస్య వెళ్ళబోసుకున్నది.

"నీదొక పెద్ద సమస్య కాదు. ఈ నగ రంలోనే సంతాన సాధువొకాయన ఉన్నాడు. ఆయన దర్శనం చేసుకున్నావంటే నీ కోరిక తీరే ఉపాయం చెప్పగలడు," అన్నది దిలైలా.

ఖాతూన్ విచారంగా, "నేనెప్పుడూ ఇల్లు దాటి వెళ్ళినదాన్ని కాను," అన్నది.

"అలా అయితే నా వెంట రా. ఇప్పుడే నిన్నా సాధువు దగ్గిరికి తీసుకుపోతాను. నీ భర్త ఇంటికి తిరిగి వచ్చేలోపల నువూ వచ్చేద్దువుగాని," అన్నది దిలైలా.



తన కోరిక ఈడేరినట్టే భావించుకుని ఖాతూన్, తన కున్న మిగతా నగలు కూడా ధరించుకుని దిలైలా వెంట బయలుదేరింది.

ఇద్దరూ కొంతదూరం వెళ్ళేసరికి సిద్దీ మొహసిన్ అనేవాడి దుకాణం వచ్చింది. సిద్దీమొహసిన్ యువకుడు. అతని కింకా పెళ్లి కాలేదు. అతన్ని చూడగానే దిలైలాకు ఒక ఆలోచన కలిగింది. ఆమె ఖాతూన్‌ను బయటి అరుగు మీద కూర్చుని ఉండ మని, తాను దుకాణంలోకి వెళ్ళింది.

ఆమె మొహసిన్‌తో, "చూడు, నాయనా, ఆ అరుగు మీద కూచున్న చక్కనిచుక్క




ఖాతూన్‌ను కూడా వెంటబెట్టుకుని వీధి వెంట నడుస్తుండగా దిలైలాకు హజ్ ముహమ్మద్ అనే కలంకారీవాడి దుకాణం కనిపించింది.

ఆమె ఖాతూన్‌నూ, మొహసిన్‌నూ దూరంగా నిలిపి, తాను దుకాణం ప్రవేశించి, ముహమ్మద్‌తో, "అయ్యా, ఆ నిలబడ్డవాళ్ళు నా కొడుకూ, కూతురూనూ. మా ఇల్లు కూలిపోయేటట్టుగా వుంటే మరమ్మతు ప్రారంభించాం. అది పూర్తి అయేదాకా—నాలుగు రోజులపాటు—మేం ఉండటానికి, మీ ఎరికిన ఖాళీ ఇళ్ళేమైనా ఉన్నాయా?" అన్నది.

కలంకారీవాడు కొంచెం ఆలోచించి, "నే నుండే ఇంటి పై భాగం ప్రస్తుతం ఖాళీగానే ఉన్నది. తరుణమప్పుడు నీలిమందు వర్తకులు వస్తే ఉండటానికి అది ఉపయోగపడుతూ ఉంటుంది. నాలుగు రోజులపాటు మీరు కావలిస్తే వాడుకోండి," అన్నాడు, తాళపుచెవులు ఆమె కిస్తూ.

దిలైలా ఖాతూన్‌నూ, మొహసిన్‌నూ వెంటబెట్టుకుని హజ్‌ముహమ్మద్ ఇంటికి వెళ్ళి, కిందిభాగం తెరిచి, లోపలికి వెళ్ళమని మొహసిన్‌కు సైగచేసి, ఖాతూన్‌ను వెంటబెటుకుని మేడ మీదికి వెళ్ళి,

నా కూతురు. దానికి పెళ్ళియీడు వచ్చింది. నీ వంటి బుద్ధిమంతుడి కిచ్చి పెళ్ళి చేద్దామని నా ఉద్దేశం. దాని తండ్రి వర్తకం చేసి పుష్కలంగా సంపాదించాడు. నీకు బోలెడంత కట్నం ఇస్తాను. కావాలంటే ఇలాంటి దుకాణాలు మరి రెండు తెరవవచ్చు," అన్నది.

మొహసిన్ పరమానందభరితుడై, "ప్రధానం ఎప్పుడుచేస్తావు?" అన్నాడు.

"నా వెంట వచ్చావంటే ఇప్పుడే చేస్తాను," అన్నది దిలైలా.

మొహసిన్ దీనారాల సంచికట్టు చంకన పెట్టుకుని దిలైలా వెంట బయలుదేరాడు.

''అమ్మాయీ, నేను చెప్పిన సాధువు ఈ మేడ కింది భాగంలోనే ఉండేది. నేను వెళ్ళి ఆయనతో నీ విషయం చెప్పి ఇప్పుడే వస్తాను. ఈ లోగా నువు నీ నగలన్నీ తీసి భద్రంగా మూటగట్టి, ఆ సాధువు దర్శనం చేసుకోవటానికి సిద్ధంగా ఉండు. ఆయన దగ్గిరికి అలంకరించుకుని వెళ్ళటం మహాపరాధం!'' అని చెప్పి కిందికి వెళ్ళిపోయింది.

ఆమె కిందికి రాగానే మొహసిన్, ''ఏమిటి, పెళ్ళిఖరారు అనుకుందామా?'' అని అడిగాడు.

దిలైలా పగలఏడుపు ఏడుస్తూ, ''నే నేం చేసేది, నాయనా? ఓర్వలేని దుర్మార్గులెవరో పిల్ల మనసు విరిచేశారు; నీకు తామర ఉన్నదనీ, బొల్లి ఉన్నదనీ దాన్ని నమ్మించారు. అది నిన్ను పెళ్ళాడనంటున్నది. ఒక పని చేద్దాం. నీ చొక్కా విప్పదీసి కూర్చో. దాన్ని తెచ్చి నిన్ను చూపి పెళ్ళికి ఒప్పిస్తా. నీ సంచీ, చొక్కా ఇలా తే, పైన భద్రంగా ఉంచుతాను,'' అన్నది.

మొహసిన్ ఆమె మాటలు నమ్మి, వెయ్యి దీనారా లున్న తన సంచీ, చొక్కా ఆమె చేతి కిచ్చాడు. వాటిని తీసుకుని దిలైలా మేడమీదికి వెళ్ళి, ఖాతూన్‌తో,



''నీ కోసం సాధువు ఎదురు చూస్తున్నాడు. నీ అదృష్టం బాగుంది. కిందికి పద. నీ నగల మూట దాచి నీ వెనకే నేనూ వస్తున్నాను,'' అన్నది.

ఖాతూన్ కిందికి దిగి లోపలికి వెళ్ళింది. దిలైలా ఆమె వెనుకగా రెండు మూటలూ పట్టుకుని కిందికి దిగి, తిన్నగా వీధిలోకి వెళ్ళిపోయింది.

ఖాతూన్ కిందిభాగం లోపలికి వెళ్ళి, సాధువు కోసం చూస్తే, అతగాడు కనిపించలేదు. కాని మొహసిన్ కనిపించి, ''చూసుకో, నా వంటి మీద ఒక్క మచ్చ అయినా ఉన్నదేమో!'' అన్నాడు.



ఖాతూన్ బెదిరి, మళ్ళీ మేడమీదికి పరిగెత్తిపోయి, తలుపు వేసి గడియపెట్టుకున్నది. అక్కడ సూఫీ సన్యాసిని లేదు— తన నగలమూట కూడా లేదు!

దిలైలా తాను సంగ్రహించిన మూటలను తనకు తెలిసిన ఒక దుకాణంలో ఉంచి, కలంకారీవాడి దుకాణానికి వెళ్ళి, హజ్ ముహమ్మద్‌తో, "బాబూ, ఇల్లు చాలా సుఖంగా ఉన్నది. మీరు చాలా పుణ్యం కట్టుకున్నారు. నేను సామాను తెచ్చుకోవటానికి మా ఇంటికి పోతున్నాను. పిల్లలిద్దరూ ఆకలి అంటున్నారు; ఈ దీనారం తీసుకుని, వాళ్ళకేమన్నా తినటానికి పట్టుకుపోగలరా? వారితోపాటు మీరు కూడా ఫలహారం చెయ్యండి," అన్నది.

హజ్ ముహమ్మద్, ఆమె ఇచ్చిన దీనారం అందుకుని, తన పనివాణ్ణి దుకాణం చూస్తూ ఉండమని, బయలుదేరాడు. దిలైలా కూడా తాను దాచిఉంచిన మూటలు తీసుకుని, కలంకారీ దుకాణానికి తిరిగి వచ్చి, ఆ దుకాణం చూస్తున్న పనివాడితో, "మీ యజమాని రొట్టెల దుకాణంలో ఉన్నాడు. నిన్ను వెంటనే రమ్మన్నాడు. వెళ్ళు నాయనా! నువు తిరిగి వచ్చేదాకా దుకాణం నేను చూస్తూ ఉంటాలే!" అన్నది.

పనివాడు ఆమె మాట నమ్మి వెళ్ళిపోయాడు.

దిలైలా ఆ దుకాణంలో కదిలించటానికి వీలైనదెల్లా ఎత్తి ఒక పక్కగా పెట్టింది. దుకాణం ముందుగా ఒక మోతగాడిదను తోలుకుంటూ ఒక కుర్రాడు వెళుతుంటే వాణ్ణి పిలిచి, "చూడు బాబూ? నీకీ దుకాణంవాడు తెలుసుగా? వాడు నా కొడుకే. మా వాణ్ణి అప్పులవాళ్ళు పట్టుకుపోయారు. ఈ సామానంతా ఊళ్ళోవాళ్ళది. వాళ్ళది వాళ్ళకిచ్చెయ్యాలి. దీన్ని నీ గాడిద మీద వేసి నా వెంట పంపిస్తావా? ఇదుగో, ఈ దీనారం ఉంచు. నేను తిరిగి

వచ్చేలోగా నీలిమందు సీసాలూ, కర్ర సామగ్రీ విరగ్గొట్టెయ్యి. లేకపోతే జప్తు చేస్తారు," అన్నది.

గాడిదగల కుర్రవాడు ఒప్పుకున్నాడు.

దిలైలా సామానంతా గాడిద మీద వేసు కుని, తన ఇంటికి వెళ్ళిపోయింది.

తల్లిని చూడగానే జీనాబ్, "అమ్మా, ఏం చేసుకొచ్చావు?" అని అడిగింది.

"నలుగురి కళ్ళలో దుమ్ముకొట్టాను. ఈ నగలు ఒక అధికారి భార్యవి. ఈ దీనా రాల సంచీ, చొక్కా ఒక దుకాణదారువి. ఈ సరుకంతా ఒక కలంకారీ వాడిది. ఈ గాడిద నాలుగో వాడిది," అన్నది దిలైలా గర్వంగా.

"చేసిందేదో బాగానే చేశావుగాని, ఇక ఇల్లు కదలకు. వాళ్ళు నలుగురూ నీ కోసం గాలిస్తూ ఉంటారు," అన్నది జీనాబ్.

"అప్పుడే ఏమయిందే, పిచ్చిదానా? ఉన్నదంతా ముందే ఉన్నది," అన్నది దిలైలా.

అక్కడ కలంకారీవాడు రొట్టెల దుకా ణంలో రొట్టెలూ, కూరా కొంటూండగా, పనివాడు వచ్చి, "ఎందుకు రమ్మన్నారు?" అని అడిగాడు. తాను పిలిచినట్టు ముసలిది పనివాడితో ఎందుకు చెప్పవలసి వచ్చిందో



తెలీక, కలంకారీవాడు తన దుకాణానికి వచ్చేసరికి, గాడిద గల కుర్రాడు దుకా ణాన్ని ధ్వంసం చేసేస్తూ కనిపించాడు.

"ఇదేం పనిరా నిన్ను పగలగొయ్యా!" అన్నాడు కలంకారీవాడు.

"మిమ్మల్ని బాకీదార్లు వదిలేశారా ఏం?" అన్నాడు గాడిద గల కుర్రవాడు.

ఒకరనేది మరొకరికి చాలాసేపు అంతు బట్టలేదు. చిట్టచివరకు, సంగతి కొంత బుర్రకెక్కి, కలంకారీవాడు, "ఆ ముస లిది ఏమైనట్టు?" అని అడిగాడు.

"నా గాడిద మాటేమిటి?" అన్నాడు కుర్రాడు.

ఇద్దరూ లబ్బున మొత్తుకుంటూ ఉండటం చూసి జనం పోగయారు. అందరూ కలిసి కలంకారీవాడి ఇంటికి వెళ్ళారు.

కలంకారీవాడు తలుపు తట్టగా మొహసిన్ చొక్కా లేకుండా వచ్చి తలుపు తెరిచాడు.

"దొంగవెధవా! మీ అమ్మ ఎక్కడ?" అని కలంకారీ అరిచాడు.

''మా అమ్మ ఎప్పుడనగా పోయింది!'' అన్నాడు మొహసిన్.

ఒకరి గొడవ ఒకరికి అర్థం కావటానికి కొంతకాలం పట్టింది.

''ఆ ముసలిది నాకు తన కూతుర్నిచ్చి పెళ్ళి చేస్తానని తీసుకొచ్చింది. తల్లీ కూతుళ్ళు మేడమీద ఉన్నారు," అన్నాడు మొహసిన్ చివరకు.

కలంకారీవాడు పైకి వెళ్ళి, తలుపు తట్టితే ఖాతూన్ తలుపు తెరిచింది.

"మీ అమ్మ ఎక్కడ?" అన్నాడు కలంకారీవాడు.

''మా అమ్మ ఎప్పుడనగా పోయింది!" అన్నది ఖాతూన్.

నలుగురూ తలలు చేర్చినమీదట జరిగిన మోసంయొక్క అసలు స్వరూపం క్రమంగా తెలియవచ్చింది. ఖాతూన్‌ను ఆమె ఇంటికి చేర్చి, మిగిలిన ముగ్గురూ నగరరక్షకుడైన ఖాలిద్ వద్దకు వెళ్ళి, జరిగినదంతా తెలిపారు.

ఖాలిద్ అంతా విని, ''ఇంత పెద్ద నగరంలో ఎందరో ముసలమ్మ లున్నారు. అందులో మీ ముసలిదాన్ని ఎలా పట్టుకొనేది? మీరే దాన్ని ఎలాగైనా పట్టి తెచ్చారంటే, దాన్ని తప్పక శిక్షిస్తాను," అన్నాడు.

తప్పేది లేక, మోసపోయిన ముగ్గురూ దలైలా కోసం వెతుకుతూ నగరం మూడు దిక్కులకూ బయలుదేరారు.

—(ఇంకా వుంది)







# వాణీకుమారి

పతంగపురాన్ని భాగ్యసింహు డనే రాజు ఏలుతూ ఉండేవాడు. అతను అన్ని విధాలా అసమర్థుడు. శాస్త్రయినా ధైర్యం లేదు. బుద్ధి మొదలే లేదు. ప్రజలు అతన్ని రోజూ తిట్టిపోసుకునేవారు. కాని భాగ్యసింహుడి అసమర్థపు పరిపాలన నుంచి ఎలా బయట పడాలో వారికి తెలీదు. ఎందుచేతనంటే ఈ రాజు దగ్గర ఇతనికన్న కూడా అవివేకి అయిన మంత్రి దుర్జయు డనేవాడు ఉండే వాడు. వాడికి కొన్ని క్షుద్రశక్తు లుండేవి. అవి చూసి ప్రజలు భయపడే వాళ్ళు. ఆ మాటకు వస్తే రాజుకూడా తన మంత్రిని చూసి భయపడేవాడు. మంత్రికి రాజ్య పాలన ఏమీ చాతకాదని తెలుసు; అతన్ని తొలగించి మరొకణ్ణి పెట్టుకోవటానికి రాజుకు ధైర్యం లేదు. ప్రజలు తనను అభాగ్యసింహు డనీ, మంత్రిని దుర్జనమంత్రి అనీ చెప్పు కుంటారని కూడా రాజుకు తెలుసు.

పతంగపుర రాజ్యాన్ని ఆనుకుని ఇంకొక దేశం ఉంది. దాన్ని ఏలేవాడు కరాళ ధ్వజుడు. ఈ కరాళధ్వజుడు మహా క్రూరుడు. అతను మహాబలసంపన్నుడనీ, యుద్ధంలో అతన్ని ఎవరూ ఓడించ లేరనీ ఒక ప్రతీతి ఉండేది.

ఈ కరాళధ్వజుడు ఒకనాడు భాగ్య సింహుడి వద్దకు దూతను పంపి, "నాతో సంధి చేసుకుంటావా? లేక నీ రాజ్యాన్ని ధ్వంసం చెయ్యనా ?" అని అడిగాడు.

భాగ్యసింహుడికి ముచ్చెమటలు పోసి, కాళ్ళు చల్ల బడ్డాయి. మంత్రి అయిన దుర్జయుణ్ణి అడిగితే, "అలాటి ప్రబల శత్రువుతో సంధి చేసుకోవటమే మేలు. నా మంత్ర శక్తులు అతని మీద పారవు. అతనికి బేతాళుడి అండ ఉన్నది," అన్నాడు.

భాగ్యసింహుడు కరాళుడితో సంధికి అంగీకరించాడు.

వి. విమలాదేవి



ప్రతి ఉగాదినాడూ భాగ్యసింహుడు కరాళుడికి పన్నెండు మంది పదిహేనేళ్ళు మించని అందగత్తెలయిన కన్యలనూ, వెయ్యి గోవులనూ కానుక పంపి, కరాళుడి స్నేహానికి పాత్రుడుగా ఉండేటట్టు సంధి జరిగింది.

ఈ సంధి చాలా గోప్యంగానే జరిగింది గాని, కాలక్రమాన దాని సంగతి ప్రజలకు తెలిసిపోయింది. అటువంటి సంధి చేసుకున్నందుకు ప్రజలు తమ రాజును తిట్టుకున్నారు. "ఇంతకన్న యుద్ధం చేసి చస్తే ఎక్కువ పరువుగా ఉండేది!" అని అందరూ అన్నారు.

ఉగాది రాబోతున్నదనగానే రాజు పదిహేనేళ్ళలోపు కన్యలను సేకరించే ప్రయత్నాలు ప్రారంభించాడు. రాజోద్యోగులు ఆవుల మందలు గల మోతుబరుల వద్ద ఆవులను పన్నుగా వసూలు చేశారు.

వీరన్న అనే ఒక సంపన్నుడైన కాపు నగరానికి కొండలకూ మధ్య నివసిస్తూ ఉండే వాడు. ఆవులను రాజుగారు వసూలు చేస్తున్నారని తెలియగానే అతను తన ఆవులన్నిటినీ అమ్మేసి మేకలమంద కొనుక్కున్నాడు. అతను చాలా పౌరుషంగల వాడు, కాని తనకు సమస్య అయి కూచుంటేనే గాని ఏదీ పట్టించుకునే వాడు కాదు.

ఒకటి రెండు సంవత్సరాల పాటు కరాళుడికి కప్పం నిర్విఘ్నంగా ముట్టింది.

ఇంతలో రాజు కొక పెద్ద భయం ఎదురయింది. రాజుకున్న సంతాన మల్లా ఒకే ఒక కుమార్తె. ఆమె పేరు వాణి. చాలా చక్కని పిల్ల. చురుకైనది కూడానూ. ఆమెకు పధ్నాలుగోఏడు ప్రారంభమయింది. వచ్చే ఉగాదికి కరాళుడు ఆమెను అడిగితే తన గతి ఏమిటి?

భాగ్యసింహుడు తన మంత్రితో, "మంత్రీ, వచ్చే ఉగాదికి మనము పంపే పన్నెండు మంది కన్యలలోనూ వాణి కూడా

ఉండాలని మన మిత్రుడు కరాళుడు పట్టు బడితే మనం ఏం చెయ్యాలి? కిందటి సారి మనం పంపిన కన్యలలో ఇద్దరు అందంగా లేరని అతనికి ఎంత కోపం వచ్చిందో చూశావుగా? మన ముష్టిరాజ్యంలో పన్నెండు మంది అందగత్తెలను, అందులోనూ కన్యలను వెతకాలంటే ఎంత కష్టమో చూడు," అన్నాడు.

మంత్రి ఈ సమస్యగురించి ఎప్పుడో ఆలోచించి పెట్టాడు. దుర్జయుడికి విలంబుడని ఒక పనికి మాలిన కొడుకున్నాడు. వాడికి పదిహేను, పదహారేళ్ళుంటాయి. చదువులో శుంఠ అని పించుకున్నాడు. వాడికున్న నేర్పంతా పిల్లుల్ని పట్టుకోవటంలో మాత్రమే.

"అమ్మాయికి ఉగాది లోపల వివాహం చెయ్యటం తప్ప మరోమార్గం లేదు. అదయినా చాలా రహస్యంగా జరిగిపోవాలి. మన మిప్పుడు నానాదేశాల రాజకుమారులకు దూతలను పంపామంటే మన మిత్రుడు కరాళుడి కీ సంగతి తెలిసిపోయి, మన ప్రయత్నాలను భగ్నం చేస్తాడు. అందుచేత, తమరి సెలవైతే, నే నొక్కమాట చెబుతాను. మా విలంబుడికీ, వాణీకుమారికీ గుట్టుచప్పుడు కాకుండా పెళ్ళి చేశామంటే ఈ ఆపద తప్పుతుంది." అన్నాడు దుర్జయమంత్రి.



ఈ మాట వినగానే రాజుకు వాంతి అయినంతపని అయింది. ఆయనకు విలంబుడంటే చాలా అసహ్యం. కాని ఇప్పుడు దుర్జయుడు చెప్పిన సలహాకు భిన్నంగా మరో ఉపాయం ఏదీ కనిపించలేదు.

"అమ్మాయితో కూడా సంప్రతించి, దానికి అభ్యంతరం లేకపోతే అలాగే చేద్దాం," అన్నాడు రాజు.

"అమ్మాయిగారికి మీరు నచ్చ చెప్పటం మీద అంతా ఆధారపడి ఉంటుంది." అన్నాడు మంత్రి.





"తప్పని సరైతే నన్ను కూడా ఆ రాక్షసుడికి కానుకగా పంపండి. ఇదివరకు మీరు పంపిన కన్యలూ, ముందు పంప బోయే కన్యలూ నా వంటివారు కారా?" అన్నది వాణి.

వాణి పెళ్ళికి ఒప్పుకోవటం లేదని తన మంత్రితో చెప్పే ధైర్యంలేక రాజు, "ఒక్కసారి మన విలంబుడు రాజకుమార్తెతో స్వయంగా మాట్లాడితే అంతా చక్కబడుతుందనుకుంటాను," అన్నాడు.

కాని విలంబుడు తన వద్దకు రాగానే వాణి అతన్ని బయటికి గెంటించినంత పని చేసింది.

కాని, విలంబుణ్ణి చేసుకోవటానికి ఎంత మాత్రమూ ఒప్పలేదు వాణి: "నా కప్పుడే పెళ్ళి ఏమిటి? ఎప్పటికైనా నేను పెళ్ళాడితే విలంబుడి లాటి చవటను పెళ్ళాడతానా? మీరు చేసుకున్న దిక్కుమాలిన సంధి ఎవడైతే తుదముట్టిస్తాడో అలాటి వాణ్ణి పెళ్ళాడతాను," అన్నది.

రాజు భయంతో వణికిపోతూ, "వచ్చే ఉగాది లోపల నీకు పెళ్ళి చెయ్యకపోతే నిన్ను కూడా మన మిత్రుడు కరాళుడికి కానుకగా పంపవలిసి రావచ్చు. అంత కంటె మంత్రి కొడుకును పెళ్ళాడటం వెయ్యిరెట్లు నయం గద!" అన్నాడు.

ఇది తెలిసి దుర్జయమంత్రికి చాలా కోపం వచ్చింది. రాజకుమార్తెను పెళ్ళాడి తన కొడుకు రాజయ్యే అవకాశం చెయ్యి జారిపోతున్నది. "వచ్చే ఉగాదికి తమకు కానుకగా పంపే కన్యలలో రాజకుమార్తె వాణీకుమారి కూడా ఉండాలని కోరండి." అని కరాళుడికి కబురు చేద్దామా అనుకున్నాడు దుర్జయుడు. కాని అలా చేస్తే ఏరు దాటకుండానే తెప్పను తగలబెట్టుకోవటం అవుతుందేమోనని తోచింది. అంత కంటె, రాజకుమార్తె కరాళుడి చేతిలో పడకుండా ఏదైనా తంత్రం ఆలోచిస్తే

ఎప్పటికైనా ఆమెను తన కోడలు చేసుకునే అవకాశం ఉన్నది.

దుర్జయుడికి ఒక గొప్ప ఆలోచన కలిగింది. మనిషిని పాముగా మార్చే క్షుద్ర విద్య ఒకటి అతనికి తెలుసును. వాణిని పాముగా మార్చి, కొంతకాలం పాముగానే జీవించ నిచ్చి, తరవాత మనిషిని చేస్తే ఆమె తిరిగి మనిషి రూపం వచ్చిన ఆనందంలో తాను చెప్పినట్టు వివాహం చేసుకోవచ్చును.

పాముగామారిన మనిషి తిరిగిమనిషిగా మారాలంటే ఎవరైనా ఆ పామును ముద్దు పెట్టుకోవాలి. ఆ పని విలంబుడే చేసినట్టయితే రాజకుమార్తె వాణ్ణి విధిగా పెళ్ళాడుతుంది.

ఇది దుర్జయుడికి చాలా తెలివైన ఎత్తుగడగా తోచింది. ఆయన ఒకరాత్రి రాజకుమార్తెను పాముగా మార్చేశాడు. తెల్లవారి చూసేసరికి రాజకుమార్తె మంచం మీద, పాము నిద్రపోతున్నది. రాజకుమార్తె జాడలేదు.

పామును చూసిన దాసీలు కెవ్వున కేక వేశారు. రాజూ, రాణీ పరిగెత్తుకుంటూ వచ్చారు. వాణి పామయిందని అందరికీ తెలిసిపోయింది. రాజు మంత్రిని పిలిపించాడు. మంత్రి వచ్చేసరికి పక్కమీది





పాము లేచి పడగ విప్పి, మంత్రిని చూసి బుస కొట్టింది.

దుర్జయుడి గుండెల్లో రాయిపడింది. వాటి మామూలు పాముగా మారక విషసర్పంగా మారింది. తీవ్ర స్వభావంగల వ్యక్తులను పాములుగా మారిస్తే వాళ్ళు విషసర్పాలవుతారు. ఈ సంగతి దుర్జయుడికి తెలియదు. ఈ పామును తన కొడుకు ఎలా ముద్దు పెట్టుకుంటాడు? కాటేసి చంపెయ్యదూ?

"మహారాజా, ఇది విషసర్పం, చంపెయ్యండి," అన్నాడు దుర్జయుడు.

"ఏ విషసర్పమైనా అది నా కూతురు. దాన్ని ఎలా చంపుతాను? ప్రారబ్ధం చాలక నా కూతురు పామయింది. మళ్ళీ ప్రారబ్ధం అనుకూలిస్తే అదే మనిషి అవుతుంది. ఏదో రూపంలో దాని బతుకు అది బతికితే నాకంతే చాలు!" అన్నాడు రాజు.

పాము మంచం మీది నుంచి దిగి ఎటో వెళ్ళిపోయింది. తిరిగి రాజభవనంలో అది కనిపించనే లేదు.

రాజుగారికి ఏర్పడిన సమస్యలాటిదే వీరన్నకు కూడా ఏర్పడింది. ఆయన ఆవులను అమ్మి మేకలను కొని "ఆవులపన్ను" తప్పించుకున్నాడే గాని, వాటి ఈడుదే అతనికి ఒక కూతురున్నది. ఆమె కూడా చాలా చక్కనిది. ఏడాది క్రితమే రాజోద్యోగి ఒకడు ఆవులపన్ను వసూలుచేస్తూ వచ్చి, వీరన్న ఇంటిముందు నిలబడి ఉన్న గౌతమిని చూసి, "ఈ పిల్ల కెన్నేళ్ళు?" అని అడిగాడు.

అందుచేత, వచ్చే ఏడాదికి రాజోద్యోగులు గౌతమిని కరాళుడికి కానుకగా పట్టుకుపోవటం నిశ్చయం. ఆ మాట తలుచుకుంటే వీరన్నకు పట్టరాని ఆగ్రహం వచ్చింది. ఆయన తన కొడుకు సునందుణ్ణి పిలిచి, "ఒరే, నీ చెల్లెలు కరాళుడికి కానుక కాకుండా ఏదన్నా మార్గం చూడు!" అని చెప్పాడు.

సునందుడు చాలా సమర్థుడు, అమిత ధైర్యశాలీ, ఉపాయశాలీ కూడానూ. అతను తన తోటియువకులను, సాహసవంతులైన వాళ్ళను కొందరిని కూడగట్టి చిన్నసేన తయారుచేసి, "మనమంతా ఒక చీకటి రాత్రి వెళ్ళి కరాళుడి రాజభవనం మీద పడదాం. అక్కడి కాపలావాళ్ళతో యుద్ధం చేద్దాం. కరాళుణ్ణి చంపకుండా ప్రాణాలతో తిరిగిరామని అందరమూ ప్రమాణాలు చేద్దాం," అన్నాడు.

ఇందుకు అందరూ ఒప్పుకున్నారు. ఒక్కరూ ప్రాణాలతో తిరిగివస్తామన్న ఆశ పెట్టుకోలేదు. జాము రాత్రివేళ సునందుడి "సేన" సరిహద్దు దాటి, అర్ధరాత్రికి కరాళుడి రాజభవనం చేరింది. పహరావాళ్ళు పెద్ద యుద్ధమేమీ చెయ్యలేదు. వాళ్ళు చాలా అశ్రద్ధగా ఉన్నట్టు కనిపించారు. చాలామంది సునందుడికి సులువుగా లొంగిపోయి బంధితులయారు. కొందరు పారిపోయారు. తనవారిలో ఒక్కడు కూడా చావకుండానే సునందుడు తన అనుచరులతో కరాళుడి శయనగృహాన్ని చేరుకున్నాడు.

సరిగా అదే సమయంలో శయనగృహంలో నుంచి భయంకరమైన అరుపు వినిపించింది. కొద్ది క్షణాలలో కరాళుడు తలుపు తెరుచుకుని బయటికి వచ్చి, నురు



గులు కక్కుతూ సునందుడి కాళ్ళ ముందు పడిపోయి, కొద్దిసేపు విలవిలా తన్నుకుని ప్రాణాలు వదిలాడు.

ఆ క్షణంలోనే ఒక విషసర్పం రాజు శయన గృహం నుంచి బయటికి పాకుతూ రావటం సునందుడి కంట పడింది. అతనికి వెంటనే అర్థమైపోయింది — ఆ పామే రాజును కాటు వేసి చంపింది!

సునందుడికి పాములను పట్టుకునే ఒడుపు తెలుసును. అతను వంగి పాము తలను చప్పున పట్టుకుని ఎత్తి, కృతజ్ఞతాభావంతో దాన్ని ముద్దు పెట్టుకున్నాడు.

మరుక్షణమే పాము మాయమైపోయి సునందుడి ఎదట ఒక రాజకుమార్తె ప్రత్యక్షమయింది. సునందుడు నిర్ఘాంతపోయాడు.

"అంతా చెబుతాను. మనం ఇక్కడ ఉండటం క్షేమం కాదు. ముందు మన పొలిమేరలలో వెళ్ళి పడదాం," అన్నది రాజకుమార్తె వాణి.

అందరూ వీరన్న ఇల్లు చేరాక రాజకుమార్తె సునందుడికి అంతా చెప్పి, "మనం చెయ్యవలసిన పని ఇంకా చాలా ఉన్నది. ఈ రాజ్యంలో నిజమైన శూరుడివి నువే కనబడుతున్నావు. నన్ను మనిషిని చేశావు గనక నేను నిన్ను పెళ్ళాడటం ఖాయం. పోతే మన దేశానికి ఇద్దరు చీడపురుగు లున్నారు. ఒకడు మా నాన్న. రెండోవాడు మంత్రి దుర్జయుడు. వీళ్ళిద్దరినీ తొలగిస్తేగాని దేశం బాగుపడదు. నీ సేనను తీసుకుని బయలుదేరు," అన్నది.

భాగ్యసింహుడు సింహాసనం దిగటానికి సంతోషంగా ఒప్పుకున్నాడు. దుర్జయుడు మాత్రం దొరకలేదు. అతని జాడ ఎవరూ చెప్పలేకపోయారు. అతను గబ్బిలంగా మారి చీకట్లో ఎగిరిపోయాడని చెప్పుకునేవారు.

సునందుడు వాణిని పెళ్ళాడి, రాజ్యాభిషేకం చేయించుకుని సమర్థుడైన రాజు అనిపించుకున్నాడు.





# మహాభారతం

విదురుడు వెళ్ళిపోగానే దుర్యోధనుడు తన తండ్రి వద్దకు వచ్చి, "నాన్నా, అస్తమానమూ ఈ విదురుడు నీ వెంటే ఉంటూ ఉన్నాడు. అందుచేత నా కడుపులో ఉన్న మాట చెప్పుకోవటానికి వీలు లేకుండా ఉన్నది. అతగాడు ఎప్పుడూ నా శత్రువులైన పాండవులను తెగపొగడతాడు. మనకు కావలసినది మన శత్రువుల పతనంగదా? అందు కేదన్నా మార్గంచూద్దాం," అన్నాడు.

ఆ మాటకు ధృతరాష్ట్రుడు, "నీ ఉద్దేశం ఒకటీ, నాది మరొకటీనా, నాయనా? విదురుడు పాండవులను మెచ్చుకుంటూంటే ఎదురు చెప్పలేక ఊకొడతాను, అంతే. నువూ, కర్ణుడూ ఏమైనా ఆలోచించి ఉంటే చెప్పు," అన్నాడు.

"పాండవులు ద్రుపదుడికి అల్లుళ్ళు కావటం చేత చాలా బలవంతులయారు. పాండవులకు ఆ ద్రుపదుడి అండ లేకుండా చెయ్యాలి. నేర్పరులైన తాంత్రికులను ప్రయోగించి, పాండవులకు ద్రుపదుడితోనూ, ధృష్టద్యుమ్నుడితోనూ పడకుండా చేయాలి; పాండవులను పాంచాలం నుంచి వెళ్ళగొట్టించాలి," అన్నాడు దుర్యోధనుడు.

దుర్యోధనుడు ఇంకా పెద్ద ఆలోచనే చేశాడు. ద్రౌపదికి అయిదుగురు భర్తలు గనక ఆమెకూ, పాండవులకూ మధ్య ద్వేషం పుట్టించటానికి సమర్థులైన మోసకత్తెలను ప్రయోగించాలి. ఈ ఎత్తులు పారే పక్షంలో పాండవులకు మళ్ళీ హస్తినాపురం చేరాలని పించవచ్చు: అందుచేత కొందరు మను

16. పాండవులకు రాజ్యప్రాప్తి



షులు వారి వద్దకు వెళ్ళి, హస్తినాపురంలో జీవితం చాలా రోతగా ఉన్నట్టు నమ్మకం కలిగించాలి.

"పాండవులలో నిజంగా పరాక్రమవంతుడు భీముడే. వాణ్ణి రహస్యంగా చంపేద్దాం. భీమార్జునులు ఇద్దరూ కలిస్తే అగ్నికి వాయువు తోడైనట్టే! కాని భీముడు చచ్చాడంటే అర్జునుడు మన కర్ణుడికి చాలడు. ఇంతెందుకు? భీముడు లేకపోతే మిగిలిన పాండవులు నలుగురూ మనకు దాసులే. ఒక ఎత్తు వేసి వాళ్లను ఇక్కడికి రప్పించి మన అధీనంలో ఉంచుకోవచ్చు," అన్నాడు దుర్యోధనుడు.



అక్కడికి వచ్చి దుర్యోధనుడి ఆలోచనలన్నీ విన్న కర్ణుడు, "నువ్వు చెప్పే ఉపాయాలేవీ జరిగేవి కావు. వీటివల్ల పాండవులకు ఏమీ నష్టం రాదు. మహాశూరులైన అల్లుళ్ళను ద్రుపదుడు లంచాలకు ఆశించి వదులుకుంటాడా? అమిత హీన స్థితిలో ఉన్నప్పుడే పాండవులను వరించిన ద్రౌపది, వారిప్పుడు మంచి దశలో ఉండగా వదిలేస్తుందా? అదీగాక వాళ్లు ఆమెను ఎంతో ప్రేమతో చూసుకుంటున్నారు. అందుచేత ఆ యెత్తు పారదు. పోతే, భీముణ్ణి రహస్యంగా చంపింతామంటున్నావు. ఇదివరకు ఇలాటి యత్నాలు ఎన్ని విఫలం కాలేదు? హస్తినాపురంలో జీవితం రోతగా ఉన్నదని నీ వేగులవాళ్ళు చెబితే నమ్మేటంత వెర్రివాళ్ళనుకుంటున్నావా ఆ పాండవులు? సామదానభేదోపాయాలతో మనం వారిని ఏమీ చెయ్యలేం. ప్రస్తుతం మనం అవలంబించదగినది దండోపాయం ఒక్కటే. వాళ్ళ కన్న మనకిప్పుడు పెద్ద సేన ఉన్నది. యాదవులూ, చైద్యులూ, మాగధులూ వారికి సాయం వచ్చేలోపుగా మనం దండెత్తి వెళ్ళి వారిని నాశనం చెయ్యాలి. ఇందులో అధర్మం, అన్యాయం లాంటిది ఏమీ లేదు," అన్నాడు.





అది విని ధృతరాష్ట్రుడు, "కర్ణుడు చెప్పినది ఉచితంగానే ఉన్నది. మన భీష్ముడూ, ద్రోణుడూ, విదురుడూ దీనికి ఏమంటారో కనుక్కుందాం," అన్నాడు.

భీష్మ ద్రోణ విదురులకు కబురు వెళ్ళింది. వాళ్ళు వచ్చి ధృతరాష్ట్రుడి నోట సంగతంతా విన్నారు.

భీష్ముడు తన అభిప్రాయం ఇలా చెప్పాడు: "నా దృష్టిలో పాండవులూ, దుర్యోధనాదులూ సమానమే. పితృపితామహుల నాటి నుంచీ వస్తున్న ఈ రాజ్యంలో పాండవులకు సగం చెందాలి. వారిని పిలిపించి వారి అర్ధరాజ్యం వారి కివ్వటం ధర్మం. అలా చెయ్యకపోతే మీ కందరికీ అపకీర్తి చుట్టుకుంటుంది. రాజులకు అపకీర్తి కన్న మరణం మేలు. దుర్యోధనా, ఇప్పటికే పాండవుల పట్ల చాలా దుర్మార్గాలు చేశావు, కాని వారికి హాని చెయ్యలేక పొయ్యావు. లక్కయింట కాలి చచ్చినవాడు పురోచనుడు మాత్రమే. వాడు కొంపకు నిప్పుపెట్టి, అందులో కాలిపోయాడంటే ఎవరన్నా నమ్ముతారా? కుంతీ, పాండవులూ లక్కఇంట కాలిపోయారని విన్నాక నాకు ఎవరి ముఖం చూడాలన్నా అసహ్యం వేసింది. వాళ్ళు బతికి ఉన్నారు గనక నీ మానం



దక్కింది. ఇకనైనా కాస్త మంచి పేరు తెచ్చుకుని సుఖంగా ఉండు."

తరవాత ద్రోణుడు ఇలా అన్నాడు:

"భీష్ముడి అభిప్రాయమే నాదీనూ. పాండవులను తీసుకువచ్చి, వారికి అర్ధరాజ్యం ఇవ్వటం అవసరం. ద్రుపదుడికీ, ఆయన కొడుకులకూ, కుంతీదేవికీ, పాండవులకూ, ద్రౌపదికీ వస్త్రాభరణాలను కానుకగా పంపండి. వాటిని తీసుకుని దుశ్శాసనుడుగాని, వికర్ణుడుగాని కాంపిల్యనగరానికి వెళ్లటం మంచిది. అలా వెళ్ళినవాళ్ళు పాండవులతో ఆప్యాయంగా మాట్లాడి, అక్కడ వారితో కొంతకాలం గడిపి, సద్భా





వంతో హస్తినాపురానికి వారిని ఆహ్వానించి, వెంటబెట్టుకు రావాలి. ఇందుకు ద్రుపదుణ్ణి కూడా ఒప్పించాలి."

వెంటనే కర్ణుడు కలిగించుకుని ధృతరాష్ట్రుడితో, "రాజా, ఈ వృద్ధు లిద్దరూ ఎల్లప్పుడూ శత్రువులను మెచ్చుకుని, నీ పురోభివృద్ధికి అడ్డుతగులుతారు. వీరి మాటలు వినవద్దు," అన్నాడు.

ఈ మాటకు ద్రోణుడు ఆగ్రహించి, "నీకు పాండవుల మీద పగ ఉన్నదిగదా అని మా మీద తప్పువేస్తావా? ప్రస్తుతం కౌరవుల మేలు కోరేవాడివి మా కన్న నువే కాబోలు? ఏమైనా, మా సలహా ప్రకారం పనులు జరగకపోతే కౌరవులు నిష్కారణంగా చెడతారు," అన్నాడు.

అప్పుడు విదురుడు, "రాజా, మేము హితం చెప్పేవాళ్ళమే గాని నీ చేత ఏ పనీ చేయించలేం. భీష్మద్రోణులు హితమే చెప్పారు. కాని కర్ణుడు అది హితం కాదంటున్నాడు. ఎవరేమి చెప్పినా, భీష్మద్రోణుల కన్న నీ హితం కోరేవారెవరూ ఉండరు. వీరి వల్ల నీకు కీడు కలగట మన్నది ఊహించటానికైనా లేదు. వారికి పక్షపాత బుద్ధి లేదు. నీకు నీ కొడుకుల మీద పక్షపాతం గనక ఇచ్చకా లాడేవాళ్ళుంటారు. వారి మాటలు విన్నావో నీ వంశానికి ప్రమాదం వున్నది. దుస్సాహసం నాశనకారి. పాండవులను జయించడం మాటలు కాదు. వారికి కృష్ణుడి అండ ఉన్నది, ద్రుపదుడి అండ ఉన్నది. భీమార్జునులు అనన్య పరాక్రమం గలవారు. మంచిగా సాధించదగినది దండంతో సాధ్యంకాదు. హస్తినాపురపౌరు లందరూ పాండవులను చూడాలని ఉవ్విళ్లూరుతున్నారు. అందుచేత వారిని పిలిపించి అందరికీ ఆనందం చేకూర్చు," అన్నాడు.

ధృతరాష్ట్రుడు ఒక నిశ్చయానికి వచ్చి, "భీష్మద్రోణులూ, నువూ చెప్పినదే హితం.





నాకు నా కొడుకులు ఒకటీ, పాండవులు ఒకటీ కాదు. విదురా, నువు వెంటనే వెళ్ళి, పాండవులనూ, వారి తల్లినీ, వారి భార్య అయిన కృష్ణనూ ఇక్కడికి పిలుచుకురా. అదృష్టవశాన వారు లక్కయింట కాలిపోకుండా బతికారు. ద్రుపదుడి కూతురు వారికి భార్య కావటం మరింత అదృష్టం! అందుచేత నా దిగులంతా పోయింది,' అన్నాడు.

అనేక రత్నాభరణాలూ, మేలివస్త్రాలూ, ఇతర కానుకలూ తీసుకుని విదురుడు కాంపిల్యనగరం చేరుకుని, ద్రుపదుణ్ణీ, ధృష్టద్యుమ్నుడు మొదలుగాగల వారినీ, కృష్ణుణ్ణీ, పాండవులనూ కలుసుకుని, క్షేమసమాచారాలు అడిగి, చెప్పి, ఎవరికివ్వవలసిన కానుకలు వారికి అందజేశాడు.

తరవాత విదురుడు సభలో ద్రుపదుణ్ణి చూసి, "మహారాజా, ధృతరాష్ట్ర భీష్ములు తమరితో బంధుత్వం కలిసినందుకు మహదానందం పొంది, తమ క్షేమసమాచారాలు తెలుసుకురమ్మని నన్ను పంపారు. తమ స్నేహితుడైన ద్రోణుడు తనకు మారుగా నన్ను తమను ఆలింగనం చేసుకోవలసినదిగా చెప్పాడు. మీ కుమార్తె భార్య కావటం పాండవులకు రాజ్యప్రాప్తి కన్న కూడా ఎక్కువైనది. పాండవులు హస్తినాపురాన్ని విడిచిపెట్టి చాలాకాల మయింది. కౌరవులు వారిని మళ్ళీ చూడాలని చాలా ఆత్రంగా ఉన్నారు. అంతఃపుర స్త్రీలు ద్రౌపదిని చూడటానికి తహతహలాడిపోతున్నారు. తమ అనుమతితో పాండవులను కుంతీ ద్రౌపదులతో సహా హస్తినాపురానికి తీసుకురావలసినదిగా ధృతరాష్ట్రుడు నన్ను ఆజ్ఞాపించాడు. అందుచేత తమరు అనుమతి ఇవ్వండి," అన్నాడు.

ఆ మాటలు విని ద్రుపదుడు విదురుడితో, "కౌరవులతో బంధుత్వం కలిసినందుకు నేను ఆనందపారవశ్యం చెందుతున్నాను.







అప్పుడు కృష్ణుడు సభవారితో, "విదురుడు కోరిన ప్రకారం అతని వెంట పాండవులను హస్తినాపురానికి పంపటమే ఉచితమని నాకు తోస్తున్నది. కాని, అన్ని విధాలా పాండవుల మేలు కోరే ద్రుపదుడి అభిప్రాయ మేమిటో?" అన్నాడు.

దానికి ద్రుపదుడు, "పాండవులు ఇవాళ నాకు దగ్గిరవారైనారు, కాని ఈ కృష్ణుడికి వారు చిన్నతనం నుంచీ ఆప్తులు. ఎంత దూరాన ఉండి కూడా అతను వారి మేలు కోరుతూ ఉంటాడు. అందుచేత ఆయన అభిప్రాయమే నాదీనూ," అన్నాడు.

ద్రుపదుడి అనుమతి లభించింది. పాండవులు ద్రౌపదినీ, కుంతినీ వెంటబెట్టుకుని విదురుడి వెంట హస్తినాపురానికి బయలు దేరారు. కృష్ణబలరాములు వారి వెంట వచ్చారు. విదురుడు పంపిన దూత ముందుగా వెళ్ళి పాండవుల రాకను ధృతరాష్ట్రుడికి తెలిపాడు. ధృతరాష్ట్రుడు సంతోషించి, పాండవులకు ఎదురు వెళ్ళటానికి వికర్ణుణ్ణీ, చిత్రసేనుణ్ణీ, ద్రోణుణ్ణీ, కృపాచార్యుణ్ణీ పంపాడు.

వారి వెంట పాండవులు హస్తినాపురం ప్రవేశించే సరికి నగరమంతా అలంకరించి ఉన్నది. ప్రజలు వారిని చూసి చాలా ఆనం

ధృతరాష్ట్రు డంతటివాడు ఆజ్ఞాపించటమూ, నీ వంటి దూరాలోచనాపరుడు రావటమూ—ఇక అభ్యంతరాలకు అవకాశమేదీ? కాని, బలరామకృష్ణు లేమంటారో తెలుసుకో వాలి; పాండవుల శ్రేయస్సును వారెల్లప్పుడూ కోరుతారు. పాండవులు కూడా మహాప్రాజ్ఞులు, ధర్మపరులు, శక్తిమంతులు—వారేమంటారో?" అన్నాడు.

ద్రుపదుడి మాటకు ధర్మరాజు అడ్డువచ్చి, "మహారాజా, మేము మీ అధీనంలో ఉన్న వాళ్ళం. మీరు ఆలోచించి మా కర్తవ్యం ఎలా నిర్ణయిస్తే అలా నడుచుకుంటాం," అన్నాడు.



దించారు. పౌరుల దీవనలు అందుకుంటూ పాండవులు రాచనగరు చేరి, ధృతరాష్ట్రుడికీ, భీష్ముడికీ, ఇతర పెద్దలకూ మొక్కారు.

కొద్దిరోజులు గడిచాక ధృతరాష్ట్రుడు పాండవులనూ, కృష్ణుణ్ణీ పిలిచి, "నాయనలారా, మీకూ దుర్యోధనాదులకూ వైరం రాకుండా కౌరవరాజ్యంలో సగం మీ కిప్పుడే ఇచ్చేస్తున్నాను. ఈనాటి నుండీ మీరు ఖాండవప్రస్థంలో స్థిరపడి, సుఖంగా మీ వంతు రాజ్యం మీ రేలుకోండి," అన్నాడు.

ధర్మరాజు సరేనని పెద్దల కందరికీ నమస్కరించి, తన తమ్ములనూ, ద్రౌపదినీ, బలరామకృష్ణులనూ వెంటబెట్టుకుని ఖాండవప్రస్థానికి చేరుకున్నాడు. ఆ ఖాండవ ప్రస్థం అన్నది మహా భయంకరమైన అరణ్యం. ఆ సంగతి గుర్తించి కృష్ణుడు ఇంద్రుణ్ణి తలచుకున్నాడు. కృష్ణుడి ఉద్దేశం గ్రహించి ఇంద్రుడు విశ్వకర్మను అక్కడికి పంపాడు.

విశ్వకర్మ ఒక మంచి ప్రదేశం నిర్ణయించి అక్కడ ఒక చక్కని నగరం నిర్మించాడు. దాని చుట్టూ ఎత్తయిన ప్రాకారాలూ, ప్రాకారం వెలుపల లోతైన అగడ్తా, లోపల తెల్లగా మెరిసే భవనాలూ, గరుడాకారం గల పురద్వారమూ, విశాలమైన వీధులూ, రాజాస్థానాలూ, దేవాలయాలూ, అక్కడక్కడా అందమైన ఉద్యానవనాలూ ఉన్నాయి. దానికి ఇంద్రప్రస్థ మనే పేరు వచ్చింది. నగరం మధ్యలో విశాలమైన స్థలంలో పాండవులు నివసించడానికి భవనా లున్నాయి. నాలుగువర్ణాలవారూ, వివిధ శిల్పాలలో నైపుణ్యం గలవారూ వచ్చి ఇంద్రప్రస్థంలో నివసించారు.

ధర్మరాజు తన తమ్ములతోనూ, భార్యతోనూ అక్కడ సుఖంగా జీవిస్తూ రాజ్యపాలన చేశాడు. కొంతకాలం జరిగాక కృష్ణుడు పాండవుల వద్ద సెలవు తీసుకుని ద్వారకకు తిరిగి వెళ్ళాడు.





# లెనిన్ గాథలు

## 3

చిన్నతనంలోనే లెనిన్‌కు కష్టాల పరంపర సంప్రాప్తమయింది. 1886 జనవరి నెలలో అతని తండ్రి, తన 54 వ ఏట ఆకస్మికంగా మరణించాడు. ఒక సంవత్సరం అనంతరం 1887 మార్చిలో లెనిన్ అన్న అలెగ్జాండర్ (సాష) సెంట్‌పీటర్స్‌బర్గ్‌లో అరెస్టయాడు—జార్ రాజును హత్య చేయడానికి జరిగిన కుట్రలో అతను కూడా ఉన్నాడు. అలెగ్జాండర్ అరెస్టయిన కొద్ది రోజులకే అతని అక్క అన్న కూడా అరెస్టయింది.

అలెగ్జాండర్ వీరుడు. తన విచారణ సమయంలో తన పక్షాన తానే వాదించుకుంటూ, ''జార్ పరిపాలన పతనం కావటం సాధ్యమే కాదు, అనివార్యం,'' అన్నాడు. అతన్ని మే నెలలో మరి నలుగురు విప్లవకారులతో బాటు ష్లిస్సెల్‌బర్గ్ కోటలో ఉరి తీశారు. అప్పుడతని వయస్సు 21. అతని విచారణకు అతని తల్లి హాజరయింది.

అన్న మరణం లెనిన్‌కు తీవ్రమైన ఆఘాతం. అతను తన అన్నను ప్రతిదానికీ ఆదర్శంగా పెట్టుకుని, అనుకరించేవాడు. అయితే జారు పరిపాలనను ప్రతిఘటించాలంటే జారును కాని, అతడి అధికారులను గాని తుడిచిపెట్టటం సరిఅయిన మార్గం కాదని లెనిన్ నిర్ణయించుకున్నాడు.

ఇంత విచారకర పరిస్థితిలోనూ లెనిన్ మాధ్యమిక (హైస్కూలు) విద్య విజయవంతంగా పూర్తిచేసి, మంచి మార్కులు తెచ్చుకుని, బంగారు పతకం కూడా సంపాదించుకున్నాడు.

1887 వేసవిలో లెనిన్ కుటుంబం సింబిర్స్క నుంచి కజాన్ పట్టణానికి మారింది.



లెనిన్ అక్కడి కాలేజీలో చేరాడు. ఆయన తీసుకున్నది న్యాయశాస్త్రం. ఇక్కడే అతనికి విప్లవవాదులైన విద్యార్థుల సంపర్కం కలిగింది.

1887 డిసెంబరులో విద్యార్థులు ఆందోళన లేవదీశారు. ఈ సందర్భంలో విశ్వవిద్యాలయం లెనిన్‌ను బహిష్కరించారు. తరవాత పోలీసులు ఆయనను అరెస్టు చేసి, కజాన్ రాష్ట్రంలోని కొకుష్కినో అనే గ్రామానికి ప్రవాసం పంపి, ఆయనపై నిఘా ఉంచారు.

ఏడాదిపాటు సాగిన ఈ ప్రవాసాన్ని లెనిన్ పుస్తక పఠనంలో గడిపాడు. ఏడాది అనంతరం ఆయనను కజాన్ నగరానికి తిరిగి రానిచ్చారు గాని, విశ్వవిద్యాలయంలో చేర్చుకోలేదు.

ఈ రోజులలోనే లెనిన్ మార్క్స్ గ్రంథాలు బాగా చదివి మార్క్సిస్టుగానూ, కమ్యూనిస్టుగానూ గట్టి పునాది వేసుకున్నాడు.

లెనిన్ కుటుంబం కజాన్ నుంచి సమారాకు మారింది. 1891 లో లెనిన్ సేంట్‌పీటర్స్‌బర్గ్ విశ్వవిద్యాలయ పరీక్షలకు ప్రయివేటుగా కూర్చుని, మొదటి శ్రేణిలో ఉత్తీర్ణుడయాడు.

తరవాత లెనిన్ విప్లవ కార్యకలాపాలలో చురుకుగా ప్రవేశించి, కమ్యూనిస్టు మానిఫెస్టోను జర్మను నుంచి రష్యను భాషలోకి అనువదించాడు.

నిరంకుశ పరిపాలనకు వ్యతిరేకంగా పోరాటం సాగించాలంటే సమారా సరిఅయిన రంగం కాదనిపించింది. లెనిన్ జార్‌చక్రవర్తుల రాజధాని అయిన సేంట్‌పీటర్స్‌బర్గ్‌కు 1893 లో చేరాడు.

రాజధానిలో లెనిన్ గడిపిన నాలుగైదేళ్ళు (1893-97) చాలా ముఖ్యమైనవి. అక్కడ ఆయన కార్మికులను సంఘటిత పరచటానికీ, కమ్యూనిస్టు పార్టీని స్థాపించటానికీ కృషిచేశాడు.



1894 ఆరంభంలో నదేజ్దా క్రూప్స్కయా అనే ఆమెతో లెనిన్‌కు పరిచయం అయింది. ఆమె ఆదివారాలు రాత్రి పాఠశాలలలో వయోజనులకు విద్య చెబుతూ ఉండేది. ఆమె మార్క్సిస్టు కార్యకర్తల బృందంలో చేరి, ఆశయసామ్యం కారణంగా లెనిన్‌కు సన్నిహితురాలయింది. వారిద్దరూ పెళ్ళాడి, జీవితంలోనూ, విప్లవ జీవితంలోనూ కూడా భాగస్వాములయారు.

లెనిన్ చాలా రకాల తప్పుడు వాదనలను ఖండిస్తూ పుస్తకాలు రాశాడు. రష్యాలో పెట్టుబడిదారీ అభివృద్ధి కాదనీ, శాసనాన్ని నిరసించరాదనీ, రకరకాల తప్పుడు సిద్ధాంతాలను "అభ్యుదయ" వాదులే ప్రచారం చేశారు. నిరంకుశపాలననూ, భూస్వాములనూ, "బూర్జువా" లనూ ప్రతిఘటించటానికి కార్మికవర్గానికీ, రైతాంగానికీ మధ్య మైత్రి ఏర్పడాలనీ, వారే సమసమాజాన్ని నిర్మించగలరనీ లెనిన్ సిద్ధాంతీకరించాడు.

నిశితమైన సిద్ధాంతాలు ప్రతిపాదించీ, తప్పుడు సిద్ధాంతాలను ఖండిస్తూ రచనలు చేసీ లెనిన్ సేంట్‌పీటర్స్‌బర్గ్ మార్క్సిస్టులకు నాయకుడుగా అయాడు.

1895 వసంతంలో, స్విట్జర్లాండ్, ఫ్రాన్స్, జర్మనీలు పర్యటించి, అక్కడి కార్మికులనూ, ప్రముఖ విప్లవకారులనూ కలుసుకున్నాడు. అదే ఏడు హేమంత రుతువులో ఆయన రష్యాకు తిరిగి వచ్చి, రాజధానిలోని మార్క్సిస్టు బృందాలన్నిటినీ ఒకటిగా చేసి, "కార్మికవర్గ విముక్తి పోరాట సమితి" ఏర్పాటు చేశాడు. మాస్కో, కీయివ్ లాటి మరికొన్ని నగరాలలో కూడా ఇలాటి సంస్థలూ, యూనియనులూ ఏర్పాటయాయి.

ఈ ఉద్యమం కొరకు "రబోచియ్ ద్యేల" (కార్మిక కర్తవ్యం) అనే పత్రిక ప్రారంభించటానికి కూడా నిర్ణయం జరిగింది. అయితే ఈ పత్రిక తొలి సంచిక

వెలువడ నున్న సమయంలో పోలీసులు దాడి చేసి, లెనిన్‌నూ, ఆయన సహచరులనూ అరెస్టు చేసి, జైలుకు పంపారు.

కాని ఇలాంటి అవాంతరాలు చూసి నిరుత్సాహ పడే రకంకాదు లెనిన్. ఆయన జైలులో వుండే విముక్తిపోరాట సమితిని నడిపాడు. సమితి కోసం కరపత్రాలూ, ప్రకటనలూ రాశాడు. అవి బయటికి వెళ్ళి, రహస్యంగా అచ్చు అయేవి. ఆయన 14 మాసాల పాటు జైల్లో ఉన్నాడు.

ఈ రోజుల్లోనే లెనిన్ "రష్యాలో పెట్టుబడిదారీ విధానాభివృద్ధి" అన్న అతి ముఖ్యమైన గ్రంథం రచించటం ప్రారంభించాడు.

1897 ఆరంభంలో లెనిన్‌కు తూర్పు సైబీరియాలో మూడేళ్ళపాటు ప్రవాసశిక్ష విధించబడింది. ఆయనను షుషెన్‌స్కోయ అనే గ్రామానికి పంపారు. అది రైలుకు దాదాపు 400 మైళ్ళ దూరంలో ఉన్న చిన్న గ్రామం.

లెనిన్ సైబీరియా చేరిన ఒక సంవత్సరానికి క్రూప్‌స్కాయా కూడా విముక్తి పోరాట సమితి కార్యకలాపాల సందర్భంలోనే అరెస్టు అయింది. ఆమె లెనిన్ వద్దకు వెళ్ళటానికి ప్రభుత్వం అనుమతించింది. వారిద్దరి వివాహమూ సైబీరియాలోనే జరిగింది.

సైబీరియా ప్రవాసంలో ఉంటూ లెనిన్ పార్టీ కార్యక్రమ ముసాయిదా తయారు చేశాడు. అంతేకాక 30 కి పైగా పుస్తకాలు రాశాడు కూడా.

1900 జనవరి 29 న లెనిన్ ప్రవాసం పూర్తి అయింది. ఆయన తిరిగి వచ్చాడు. అయితే ఆయనను ప్రభుత్వం మాస్కోలో గాని, రాజధానిలో గాని, ఏ ప్రముఖ పారిశ్రామిక నగరంలో గాని స్థిరపడనివ్వ లేదు. అందుచేత ఆయన, సేంట్‌పీటర్స్‌బర్గ్‌కు దగ్గిరలో ఉండాలనే ఉద్దేశంతో, "ప్స్కోవ్" అనే గ్రామంలో తన నివాసం ఏర్పాటు చేసుకున్నాడు.



ప్రపంచపు వింతలు : 

# 103. ప్రాచీన విగ్రహం

టర్కీకి నైర్‌ఋతి మూలలో ఉన్న కోస్‌దీవిలో అస్క్లిపియోస్ దేవాలయం ఉండేది. ఇది ఔషధ దేవత ఆలయం. ఇప్పుడు శిథిలమైపోయింది. ఈ శిథిలాలను ప్రాంతంలో ఒక కర్షకుడు భూమి దున్నుతూండగా ఈ ప్రాచీన శిల్పం బయటపడింది. ఇది 1800 ఏళ్ళనాటిదని అంచనా వేశారు. సుప్రసిద్ధ గ్రీకు "ధన్వంతరి" అయిన హిపోక్రటీస్ విగ్రహమే ఇది అని నమ్ముతున్నారు. ఆయన ఈ దీవిలోనే జన్మించాడు.



Photo by Prabhakar Mahadik



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఎవరి కోసం?

పంపినవారు:
డి. ప్రసాదరావు, వేమూరు

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1970 ఆగస్టు నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి అయిన వ్యాఖ్యయి ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూన్ నెల ఆఖరు తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/- లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఈ వేషం

రెండవ ఫోటో : ఎవరి కోసం?

పంపినవారు : దాసరి ప్రసాదరావు,
వేమూరు. (గుంటూరు జిల్లా)

బహుమతి మొత్తం రు. 20/-ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'


ఆనంద్‌కు ఇంచుమించు స్కాలర్‌షిప్ పోయినంత పనైంది!


పరీక్ష రోజున...
ఆనంద్, పరీక్ష బాగా రాయాలి. స్కాలర్‌షిప్ నిలబెట్టుకోవాలి. గుర్తుంచుకో!


పరీక్ష హాల్లో...
బలే, పేపరు ఎంత తేలిగ్గా ఉంది!


ఒక గంట తరవాత...
నా పెన్ను రాయటం లేదు, ఏమైందో.


టైములో పూర్తి చెయ్యటం ఎట్లా?


విచారించొద్దు, ఆనంద్. ఈ కేమ్లిన్ పెన్ను, కేమెల్ సిరా తీసుకుని రాయి.


హా, ఈ సిరా బలే బాగా రాస్తోంది. అక్షరాలు మెరుస్తున్నాయి కూడా. టైములో రాయటం పూర్తి చేస్తాను.


ఆనంద్ టైములో పూర్తి చేశాడు...


పరీక్ష ఫలితాలు తెలిసిన రోజున...
శెబాష్ ఆనంద్
పాసయ్యావు అభినందనలు


గుర్తుంచుకోండి, కేమెల్ సిరా మరియు కేమ్లిన్ పెన్ను సాఫీగా రాస్తాయి. ఎప్పుడు కేమెల్‌యే కావాలనండి.
uxe ink









బ్రూక్ బాండ్ A-1 డస్ట్ టీ
ప్యాకెట్టుకు
హెచ్చు కప్పుల మంచి టీ

BB 5381



# వివా

రెండు విధములుగా ఆరోగ్యమును కలిగించే పానీయము

## పగలంతా ఎంతో శక్తి...
## రాత్రంతా సుఖమైన విశ్రాంతి



ప్రొద్దున్న **వివా** త్రాగుతే... రోజంతా ఉత్సాహముగా ఉంటారు! మాల్ట్, గోధుమ మరియు ప్రోటీనులతో వివాలోని పూర్తి మీగడగల పాలు పుష్టివంతముగా చేయబడినవి.

రాత్రి **వివా** త్రాగుతే... రాత్రంతా గాఢముగా నిద్రపడుతుంది! వివా యొక్క పసందైన రుచి మరియు దానిలోని పోషకవంతమైన పదార్థములు స్నాయువులను బలపరుస్తాయి, నరములకు ఉపశమనమును కలిగిస్తాయి, కండరములకు సేద దేరుస్తాయి.

**వివా** సులభముగా జీర్ణమవుతుంది... రోగులకు మరియు రోగమునుండి కోలుకొంటున్న వారికి ప్రత్యేకముగా సిఫార్సుచేయబడినది.

**ఆరోగ్యమునకు త్రాగండి వివా!**
నీళ్లలో లేక పాలలో దాని రుచి అహా!







భారతదేశములో తయారుచేయువారు:
జగత్‌జిత్ ఇండస్ట్రీస్ లిమిటెడ్.
జగత్‌జిత్ నగర్, హమీర (పంజాబ్)

సోల్ సెల్లింగ్ ఏజెంట్లు:
హోమ్ ప్రొడక్ట్స్ మార్కెటింగ్ ఏజెన్సీ.
ఏ డివిజన్ ఆఫ్ సారాభాయ్ సన్స్ ప్రైవేట్ లిమిటెడ్.

shilpi j.i-la/70 tel.

# AWARDS!

## WON PLENTY

YET WE DON'T SAY
WE ARE THE BEST
ONLY
WE DO OUR BEST





**PRASAD PROCESS PRIVATE LTD**
CHANDAMAMA BUILDINGS MADRAS-26

